# రూపనవనీతమ్

రాయప్రోలు సుబ్బారావు

రెండు రూపాయలు

రాయప్రోలు సుబ్బారావు

# రూపనవనీతమ్



1953

లలితాకుటీరం
సికింద్రాబాద

ఓమ్ !

ధృతిః క్షమా దయా శౌచం
కారుణ్యం వాగనిష్ఠురా
మిత్రాణాం చానభి ద్రోహః
సప్తైతాః సమిధః శ్రియః

(వ్యాస)

# నివేదన

పాత్రలు, ప్రవేశ నిష్క్రమణములు, రంగములు ఇలాటి విభాగీకరణంవల్ల ఈరచనకు రూపకచ్ఛాయ వచ్చింది. కాని, ఇది రసానుపాదకమయిన దృశ్యబంధము కాదు. భావాభివ్యంజకమయిన కల్పనగా కాంక్షితమైన రచన.

ప్రాణులకు అంతర్వికారములు సహజములు. అవి కానరావు. కాని, ఉత్కటానుత్కట స్థితినిబట్టి ఆ యా వికారములు అంగవిన్యాసమందు దృశ్యము లగుట కూడా సహజమే. ఉల్లాసము, ఉద్రేకము, భయము, భ్రాంతి, సిగ్గు, బీదర ఇల్లాంటి మనోవికారములు దాగక పైకి పొంగుట లోకప్రసిద్ధం. వ్యక్తిగతములయిన ఈ చేష్టితములు రూపకాదులలో అనుభావములయినవి. అభినయమున కిదే ప్రాతిపదిక.

ప్రాణికోటిలో మానవుడు ఉత్ఫుల్లమేధావియై అస్తినాస్తి విచికిత్సలో తపించి తనబుద్ధిని ధారపోశాడు. ఈ వికస్వరచింతనలో, ఈ విశ్వకళాభావనలో అనంతమయిన మీమాంస, అపూర్వమయిన అభివర్ణన ఆవిష్కృతమయింది.

జీవితతత్త్వమును, దాని మహత్వమును సమాలోచనచేసి నిరూపించిన భావములును, జీవితసువృత్తమును, దాని సౌభాగ్యమును విచక్షించి వివక్షించిన భావములును ఒకటికావు. ఒకటి భావచర్వణ విశేషంకాగా, రెండవది రసరూపము నందింది. రూపనవనీతమునందలి భావసంయోజన ద్వితీయవర్గములోనిది కాదు.

సృష్టి ఈశ్వరలీల. దీనికి కర్త బ్రహ్మ. అయితే, దృష్టాదృష్టమయిన సృష్టిలో మానవుడు "నేను బ్రహ్మను" అన్నాడు. అంటే, మానవునిలో సకల జంతు సహజమైన కర్మకలాపమే కాక, బ్రహ్మానుభావకమయిన దివ్యాంశకూడా వినిమితంగా ఉన్నది.

ఇక, మానవజీవితం స్త్రీపుంసయోగము. అట్లు కాకపోతే ప్రజాతంతువు తెగుతుంది. మానవుడులేని ఇతరజగత్తు పరివర్తమానమైనా, అది శిరస్సులేని శరీరంలాగా నిశ్చరితమూ, నిష్క్రమితమూ అవుతుంది.

చేతనాచేతన ప్రపంచములో రతి అనే చిత్స్వార్థమున్నది. అది మానవులలో స్త్రీపుంసయోగనియతమై, నిర్వృతమయినప్పుడు పుష్పించి, ఫలించి, ఆవరణ

ముక్తమై, ఆనందానుసంథానమై విపాకము పొందుతుంది. స్త్రీ పుంసయోగస్థాయి విలసనమే శృంగారము. ఏతత్ భావభావనతో సంసార క్షీరసాగరం మధింపగా ఉన్నీతమైనదే రూపనవనీతం.

సంవాదరూపకమైన రచన మనకు కేవలం అపరిచితము కాదు. ఉపనిషత్తులలో, శాస్త్రాదులలో ప్రశ్నోత్తరభంగి కలదు. మా గురుదేవులు ఇలాటిరీతిలో చిన్నచిన్న రచనలువ్రాసి నాటికలని పేరుపెట్టారు.

గానము, గీతము సమానార్థకములుగా పాటించారు నైఘంటికులు. అయినా, కేవల స్వరాలాపనాదికమును గానంగాను, సాహిత్యమిళితమైనదానిని గీతంగాను విచక్షించుకోవచ్చు. గేయంలోని నాదప్రాధాన్యమును దాటిన శబ్దరచన సంవాదరూపంగా స్ఫుటమైనదని భావించుచున్నాను. ఇది ఛందో నిబద్ధమయిన వృత్త రచనకు సద్యః పూర్వదశ కావచ్చు. ఈ పక్కి ఇందు అనువర్తితము.

ఇందు ఉపబద్ధములయిన వాదోప వాదాంశకు శ్రీ ఆనంద వర్ధనుని దర్శనమే ఉపదేశం. ప్రసక్త పంక్తులను స్థాలీపులాకంగా ఉద్ధరిస్తున్నాను :

"శృంగార రసోహి సంసారిణాం నియమేన అనుభవ విషయత్వాత్, సర్వ రసేభ్యః కమనీయతయా ప్రధాన భూతః.

విప్రలంభ శృంగారే కరుణే మాధుర్యం ప్రకర్షయత్.

విప్రలంభే సౌకుమార్యాతిశయోస్తు.

విరోధం అవిరోధం సర్వేషు రసేషు నిరూపయేత్ సహృదయః

విశేషస్తు శృంగారే, తస్య రస పరిపోషకాత్మకత్వాత్, రతేశ్చ స్వల్పేనాపి నిమిత్తేన భంగ సంభవాత్, శృంగారః సుకుమారతరః సమనాగపి విరోధి సమావేశం న సహతే.

తత్రహి ప్రమాద్యతః తస్య సహృదయమధ్యే క్షిప్రమేవ అవజ్ఞాన విషయతా భవతి."

నందన మార్గశీర్ష పూర్ణిమ
లలితా కుటీరం
సికింద్రాబాద

రా. సు.

# పరిచయం

## దేశ కాల పాత్రాదులు

సుందరీసుందరులు; వకుళా నవనీతులు; సుగంధీ పరంజ్యోతులు —వీరు భార్యాభర్తలు.

భామతి: బ్రాహ్మణులయింటి ఆడుపడుచు, అభిజనం సాందీప గురుకులం. రోహిణీ కన్యావరణం దాటకముందే నష్టసూత్రయైన దివ్యగాత్రి. అకామహిత, విదుషి. శాస్త్రాదులతోపాటు గాంధర్వ నాట్యవేదాదులు అభ్యస్తములు.

విభా; శుచీ: నిత్యకన్యలు; గురుకుల వాసినులు; సంప్రదాయ సంస్కార ముల సుశిక్షితలు.

లీల: శిష్టసంపన్న కుటుంబములో పుట్టిపెరిగిన సుముఖి. కులాచార వినీత. సుభాషికి ఆశైశవబద్ధ మైత్రేయి. స్నేహప్రీతి ఆమెకు సహజగుణం.

సుందరీ సుందరులు: సుందరుడు ఆజన్మ ప్రతిభాశాలి. సంగీత సాహిత్యములలో నిష్ణాత. విజ్ఞానముగల వర్చస్వి. ప్రియప్రాయమైన వర్తనం. కామ కౌతుకి. సుందరి అదువు అజ్ఞలలో పెరిగిన పిల్ల; రూపవతి; అమాయకురాలు.

వకుళా నవనీతులు: నవనీతం సాహితీవ్రతి. శబ్దబ్రహ్మనిష్ఠుడు, రస మయంగా జగన్మంగళ బింబమును దర్శించు సహృదయుడు. మాధుర్యం ధ్యేయం. వకుళమాల: దాక్షిణ్యమయి; చక్కనికంఠం. సంస్కృతమైన బుద్ధివిభవం. దైన్య యాచనాదులకు అవశంగా కరిగిపోయే స్వభావశీలం. సంశయం సర్వవిక్షేపములకు హేతువు. స్నేహం సకల సుఖములకు అనుశయం. ఇది వీరి జీవితసూత్రం.

సుగంధీ పరంజ్యోతులు: తృతీయ మిథునం. జ్యోతి చిత్రకళోపాస కుడు. అతనికి ధ్యేయము సౌందర్యం. చరాచరమైన సృష్టి అంతా సుందరం.

దానితో నిత్యాను సంధానమే సుధర్మ సాధన. సుగంధినికూడా అతడు సౌందర్యా చరణంలో సుశిక్షితనుచేసెను.

సుగంధి: శీలగంధముగల స్త్రీయ. వినయ ఏకాసము ఎంతఉన్నా వివేక గర్వము వదలని ముదిత.

సుభాషి: సరసకళావేత్త. బహువాసనా మిత్రుడు. మేధావి. ప్రియశాలి, సుఖలాలసి, అనుకామీనుడు; అనుద్వాహితుడు; ప్రజ్ఞావాది.

శ్రావణక సునందులు: గురుకుల బ్రహ్మచారులు, అనూచానులు.

కాలం: కంసరాజ్యం కడతేరింది, శ్రీ కృష్ణచోద్యంగా ధార్మిక సామాజిక చక్రం తిరుగుచున్నది. లోకక్షేమ విధాతలుగా విశ్వసింప బడుచున్న విశ్వేదేవత లకు యజ్ఞ యాగాదులు జరుపుట సంప్రదాయం. ఆ విధాయకం నిరుద్ధమై నిలిచి పోయింది. ఆ శూన్యస్థితిలో నృత్తగీత వాద్యాదులు నైజచిత్త వినోదములుగా సమాజ మందు పాదుకొంటున్నవి. ఆ పరివర్తనం ఎంత విప్రతిపన్నమయిందో అంత నిగూఢ కళాసంపన్నముకూడా అగును. త్రివర్గబద్ధమయిన కామం బహుత్రానురాగంగా అతివ్యాప్తిస్ఖలితమై దుష్టం కాసాగింది. ఆకాలమందే రాధాదేవి అబోధప్రణయము అవద్యానవద్య మీమాంసకు గురి అయింది. అంగజ కర్మాదికము అవంగభావ నాదికంగా రూపాంతరముపొందే ప్రసాదన ప్రభావములు అమలిన కళాసాధనలో కలవని తేలింది. అపూర్వమయిన ఆ ప్రత్యుత్థాపనలో అవ్యవస్థితంగా ఘూర్ణితమైన సమాజ క్షీరసాగరమునందు స్త్రీ పుంసయోగ ప్రాప్యమయిన నవనీత సిద్ధి అయింది.

ఓమ్

## ఆ ము ఖ ము

కనంగా కాంతంబై సుముఖజన చక్షు స్స్రవనమై
వినంగా తియ్యంబై మనన మథితాంతః కరణమై
శ్రియః స్థాయీభావంబయిన నవనీతాభినయమున్
నివేదింతుర్ నారీ నర కవల యోన్మేష సరణిన్

సూత్రధారి (ప్రవేశించి)

కులస్త్రీ మంగల్య వ్రతహిత ఋజూద్యాపనములున్
భగిన్యాభిజ్ఞానప్రియ సముపచారాభిరతులున్
కుమారీ కళ్యాణ క్రతుకుశల నిర్వాహవిధులున్
రసబ్రహ్మాండంబం దమలినము లౌ ప్రేమరుచులై

సూత్ర : ధర్మిణీ! కళాదీపారాధనమయితే, ఒక్కసారి ఇలా రావాలె.

(ప్రవేశము నటి-చేతిలో పూలదండలు ఉండును)

నటి : మిత్రమిశ్రుడా! ఏమికార్యమూ ?

సూత్ర : మైత్రేయీ! నేటి రూపనివేదనకు ముందు నీవొక ప్రియగీతము పాడుము.

నటి : చతురుడా! ప్రియముగాని గీతముకూడా ఉండునా ?

సూత్ర : నిజమే. అయినా చరాచరప్రియమైన తొలకరిని పలకరించే పాట పాడవలెనని నా భావము.

నటి : అలాగా. (పాడును)

నీలాల పుట్టింట నీల్లాడ వెల్లేటి
కాదంబినికి దీపికలుచూపు తారాలి

తీరైన తొలకరి పేరంటముల కేగ
పచ్చకోకధరించి భ్రమియించు భూదేవి
పసుపు పయ్యెదకొంగు లసియాడ తలలూచు
తీగె కన్నెలనంటి రాగిల్లు రవగాలి
తరుణ తాపములార్చి
తలపులను తీపార్చి
నిఖిల కాంతాలోక
నీపాళి తనియించు

సూత్ర : ఆహా! మానససుప్త హంసమిథునాలనుకూడా మేలుకొల్పుతున్నది.

నటి : (చిరునవ్వుతో) నా కంఠమా? నీ కవనమా?

సూత్ర : రాగిణీ! రెండునూ; కలిసి-

నటి : అయితే - ఇద్దరమును కలిసి...

సూత్ర : ముద్దుగా -

నటి : ముచ్చటగా పాడుదము!

(అని, పూవులు సదస్సుపై చల్లి, దండతో ఇరువురి హస్తములను కలిపి బందమేయును. ఇరువురును ఏకశ్రుతిలో విడివిడిగా పాడుదురు)

నటి : సొనలు మెలిజడ లల్లుకొనుచూ
కన్నెచిన్నెలు చూపు సఖుడా!

సూత్ర : పచ్చగిల్లిన బాలతృణములు
ఇచ్చు ముక్తాంజలిని చెలియా!

(నిష్క్రమింతురు)

## మొదటి రంగము

గోకుల పురోపకంఠము. కదంబవనాంచలము

రతీ, భామతీ

రతి : భామతీ! వింటివా, నా ప్రాణేశ్వరుని లోకులు ఎల్లా ఆడిపోసుకొనుచున్నారో? అందును, సుందరీబృందములో మరీ నిందాకందమై పోయినాడు. నలుగురిలో తలచూపడానికి జంకుచున్నాను. జగత్తులో జరిగే జారచారణకంతకూ నా కాంతుడే కారణమట. నైష్ఠికుల భ్రష్టబంధమునకునూ నా నాథుడే మూలమట. ఇక, బ్రహ్మవాదుల బహిష్కారవచనాలకూ, పౌరాణికుల పాపపాతాలకూ అంతే లేదు. నా నోచిన నోములలో ఏ లోపము తగిలిఉంటుందో ఊహింపగలవా ?

భామతి : దేవీ! ఎందుకీ దిక్కుమాలిన చింత. నీ నోములు అనూనంగా ఉద్యాపనలై ఉండాలె. నీవు చేసిన పూజలో ఒక్క పుచ్చుపువ్వైనా పడి ఉండదు. ఇది నిజం. ఎందు కందువా ? సుందరాతిసుందరమైన సృష్టిలో నీవంటి లక్షణవతి వేఱొకతె కానవచ్చుటలేదు. అది నీ పూజా పుష్పవాసన అనక తప్పదు. సకలజనాకర్షకమైన సుకుమారచక్రములో నీ విభునివంటి శుభశాలికూడా మఱొకడు వినబడుటలేదు. ఇది నీ నోములు పూసిన పసుపుపూత కాదా ?

రతి : గురుభగినీ! నేనుకూడా పలుమాఱు ఇల్లాగే భావించుకొందును. కాని, నా పూజ పూర్ణపూత మయినదే అయితే నా ఆనందము అనవగీతముగా నిలువవలసిందేగదా!

ఈ చింతాజ్వర మెందుకు సోకింది? ప్రాణేశ్వరుని కీర్తి బింబమును కబళించుటకు ఈ కార్పణ్య కేతు వేల కారాడుతున్నది? చెప్పగలవా?

భామతి: సుమంగలీ! నీ శంక చంద్రునిలో కలంకములాగా తేలేదికాదు. కాని, ఒక్కముక్క చెప్పగలను. లోకములో సురూపానికీ, విరూపానికీ ఎన్నడూ చుట్టరికం కుదరలేదు. సౌందర్యసంపత్తికై నోచుకోనని కురూపి కులమంతా కుత్సితమై కసిపోక మసి పూసుకోవడం లోకసహజముగా ఉన్నది. తన వికారరూపమును చూపిస్తున్నదని అద్దమును బ్రద్దలుగా పొడుస్తుంది మాలకాకి. త్రాగలేక పాలదుత్తను పడద్రోసి పోతుంది పలుగాకిపిల్లి. అద్దము చేసిన అపచారముకానీ, పాలదుత్తచేసిన పాపముకానీ ఏమీలేదు. అదే 'చుప్పనాతి సూడు' అంటారు ప్రజలు.

రతి: (అత్యంతావధానమును అభినయించి) ఎలాగూ— ఈ లోకన్యాయము జ్ఞానేంద్రియములున్న మానవులపట్లకూడా అన్వయిస్తుందా? అయితే, దీని తాత్పర్యమేమి?

భామతి: సుభగరూపములో శుభ్రచైతన్యాంశ ఉన్నట్లు తోస్తుంది. అది సాక్షిభూతముకదా! నీ రమ్యరూపము ఎదురుపడగానే ఎవరి వికారం వారికి దర్పణములోలాగా కనబడుతుంది. స్వాపకర్ష ఎప్పుడును దైన్యానికి తల్లి. దానితోనే చిత్తక్షోభ ప్రారంభమవుతుంది. పరుల ఉత్కర్షను చూడలేము. కచ్చెకూ, కుచ్చితానికీ ఆవేగ అసూయలే మూలం. అందనిపండ్లు పుల్లని వనకపోతే 'అహం' సమాధానపడదు.

అపవాదలాడినా-అపహసించినా-అన్నీ ఆవికారం వెళ్లగ్రక్కే-అనుభావములే. అప్రాప్త విభవస్పర్ధయే దీనికంతా బీజము.

రతి : అయితే, చక్కదనము అంత పరమోదాత్తపదార్థ మని నీభావమా ?

భామతి : సందేహమెందుకు. అందముకంటె ఆద్యంత కామ్యమైన ప్రసన్నసౌభాగ్యం మఱొకటి లేదు. ఐశ్వర్య వంతులు సైతము అందము కోసము ఆరాటపడుదురు. కాసులు గవ్వలవలె వెచ్చిస్తారు. చేదునైనా మ్రింగుదురు.

రతి : గురుపుత్రీ! ఐశ్వర్యము ఈశ్వరసంబంధమైనదిగదా! అది పొందగలిగిన సంపన్నులు ఈశ్వరభక్తులై యుండాలె. అట్టివారికి సౌందర్యసంప్రాప్తి కాకపోవు టెట్లు? ఐశ్వర్యము సౌందర్యమును సాధించలేదనడంకంటె ఈశ్వరసంపత్తిలో సౌందర్యము స్వాంశకాదేమో!

భామతి: బుద్ధిమతీ! అది స్మర్తల సామాన్యవాదమేకాని నిజంకాదు. శాంతమ్-శివమ్-సుందరమ్-అని అమందముగా మహర్షులే గానం చేసిరి. ఈ అమృతావధానం జగద్వ్యవస్థ లోనే పరిస్ఫుట మాతున్నది. విరాగము విరూపముకాదు.

(తెరలో)

తూర్పు టిల్లాలు ప్రొద్దు ప్రొద్దులనుగన్న
చాయల కుమారహారిని సందెపడుచు
బంగరు కవాటములుతీసి పడకటింటి
పవ్వళింపులసేవకై వలచిపిలుచు

రతి : ఆహా ! ఎవరి దీ గీతం.

భామతి: సుతీర్థుడు. శ్రావణుని కంఠస్వరం. అతిదూరములో పాడుతున్నట్లున్నది. అందువల్లనే అంచులు అందుకొంటూ ఉన్న తటాకతరంగమువలె సన్నగిల్లి అలసాలసంగా ప్రాకుతూ వస్తున్నది. లీలాప్రాయమయిన ఈ దివ్యసృష్టిని తిలకించుము. దూరాదూర భేదం లేకుండా శైత్యసౌరభ చయనంచేసి ఆప్యాయప్రసాదం పంచిపెట్టే ప్రాణప్రదాత పవమానుడు. చైతన్యగర్భం చల్లపడి పచ్చగిల్లేటట్లు చరాచర ప్రపంచానికి పుష్కలపమోదానము చేస్తారు సుజలదేవతలు. నిత్యమూ, నియతమూ అయిన ఈ మహావిన్యాసమందే - దృష్టాదృష్ట ములుగా- సౌందర్యరూపరేఖలు కుదిరి కూడివున్నవి. అనంత జ్యోతిర్మయమైన ఆకాశం అక్కడా, సమస్తవస్తు సంపన్న మైన భూచక్రం ఇక్కడా ; - ఈ రెంటి రమణీయసంవరణమే సౌందర్యబంధము.

రతి : కాగా, సౌందర్యసౌభాగ్యమంతా ఈ బ్రహ్మాండ భాండమందే నిండియున్నదని తేలింది.

భామతి : సందేహ మెందుకు !

రతి : అటులైనచో ఆ కమనీయవైభవము యావద్భూత జాతమునకును ఏల అందదు ? ఎందుకు అనుభూతముకాదు ?

భామతి : ఎందుకందువా ? నిత్యపరిచయంచేత అలక్షితమై నీరసప్రాయమై పోయినది. నిరంతర నివృత్తిబోధలవల్ల దానిపట్ల నిషిద్ధబుద్ధి బలిసింది. ఇంకా, శుష్కచింతా అతి చారంచేత అనభ్యస్తస్థవిరమై నీచగిల్లి నిగుప్తమైనది.

రతి : అయితే, నిక్షేపంగా నిలిచి ఉన్నదన్నమాట. దానిని గవేషించి, గుర్తించి, ఉన్మేషింపచేసే ఉపాయము చెప్ప గలవా ?

భామతి : అదికూడా ఒక సాంగసాధన - సహజమైన సాధన. చక్కని మనసూ, చిక్కని అభ్యాసం కావాలె. సురూపానుశయమైన చూపు - స్నిగ్ధకామముగ్ధమగు అంతః కరణము దీనికి అంగన్యాసములు. రత్నాకర మేఖల ధరించిన భూమి యిక్కడ, తారాభరణములు తాల్చిన ఆకాశ మక్కడా ; - ఈ నడుమనున్న సమస్త ఆశావకాశమున్నూ ఆవరణం. సౌందర్యపరమాణు పరిభ్రమణం ఈ అంతరాళ మందే జరుగుతూ ఉంటుంది. రమ్యాలోకసూత్రాలకు మాత్రమే ఆ రుచిరాణువులు చిక్కుతవి. వానిని అంతఃకరణ కాసారములోని పక్ష్మకోశమునందు బంధించాలె. అప్పుడవి సహధర్మబలంచేత ప్రాణలీనము లౌతవి.

రతి : శారీరకమయిన సౌష్టవము అశరీరకమైన వర్చ స్సుగా పరిణమిస్తున్నదని ద్యోతమవుతున్నది.

భామతి: మాల పూర్తి అయినతరువాత తొలి పువ్వేదో, తుదిపువ్వేదో గుర్తింపగలవా ? పూర్ణావస్థలో మొదలు తుదలు ఉండవు. అందుచేతనే హృదయవాదులు మాలా కరణమును సాధనావస్థగాను, విలీనీకృతిని సిద్ధిగాను విలక్షి స్తున్నారు.

రతి : విదుషీ ! హృదయవాదమనీ-హృదయవాదులనీ ఇటీ వల పలుమాఱు వినుచున్నాను. దానితత్వం కొంచెము విస్త రిస్తావా ? వినుటకు వేడుక పడుతున్నాను.

భామతి : చెలీ! తత్వమంటే తహతహ పుట్టుతుంది. హృదయవాదులు కేవల తత్వవిచికిత్సను ఉపేక్షించారు. ఆనందముకూడా అంతమై, అనుభూతికి అందని ఆస్తిక ప్రాప్యము వారికి ఉపాదేయము కాదు. సౌరభస్థానమైన శిరీషపుష్ప మును వదలివేసి, దానిపరిమళము పోయే పంథను వారు విచారింపరు. ప్రాణప్రతిష్ఠితములైన సర్వేంద్రియవర్గములోనూ హృదయం- పూలలో పద్మములాగా- అత్యంత సుకుమార శుచిమంతమైనది. అందుచేత విషయాదులకన్నిటికీ దానిని హరించడము అభీష్టము. ఏతత్ సంనికటమందే-

(తెలలో-ఇరువురును అవధానముతో నాలకింతురు)

నల్లమబ్బుల నడుమ నటియించు మెఱుపట్లు
జ్వాలమాలాకుల స్తబక భాస్వంతమై
నీవారశూకాగ్ర నిభమై నిశాతమై
పచ్చగా పరమాణు పరిమాణమున వెలుగ
పరమాత్మ హృత్కోశ పరిసరావరణాన
పాడవే లోకంబు పాషాణమై పోయి
వేడుకా - వేదనా - వెలిపోవకయమున్న
మంజుమంజులముగా మహతీమతల్లి!

భామతి : ఆహా! యెక్కడి దీ అవ్యక్తరక్తాలాపన? సఖీ! వింటివా-ఉద్దిష్టమాధురీ సూక్తమునకు ఉపశ్రుతియై, నా అంతరంగ కాంతోపనిషదనువాకమునకు ఇష్టానుకూలంగా వినబడుతున్నది, ఆత్మపేయమయిన ఈగేయము. అదిగో! నాదోపాసనా విశారదుడు.

(గేయము పాడుతూ మహర్షి నారదుడు ప్రవేశించును)

భామతి : మహతీమంగళవాదీ! సాందీపకులపుత్రి, ఆత్రేయ సగోత్రి. భామతి అభివాదము సర్పించుచున్నది.

(మ్రొక్కును)

రతి : శ్రీ కృష్ణుని కూరిమికోడలు, ప్రద్యుమ్నుని ప్రాణేశ్వరి రతి భక్తితో ప్రణమిల్లుచున్నది. (మ్రొక్కును)

నారద : అభీష్టార్థ సిద్ధిరస్తు!

భామతి : దేవా! ఈ దివ్యవీణాగాన వేణిక నేడు మావంక కెట్లు మరలినది?

నారద : వత్సే! మధురనుంచి మా రాక నేడు. దూరాంతిక భేదము లేకుండా లోకశ్రుతిని ధ్వనింపచేసే స్వరశక్తి మా మహతీతంత్రులకు కలదు. నేడు దాని గేయము తిన్నగా ఇచ్చటికి త్రోవ తీసినది. మేమును దానిని అనుగమించితిమి.

రతి : స్వామీ! మధురలో మా స్వజనముతో కూడ పౌర జనము కుశలమా?

నార : కలకలములో అందఱును కుశలురుగా నున్నారు.

భామతి : విద్వన్మునీ! మీ పలుకులు సాపేక్షితములుగా ధ్వనిస్తున్నవి. మధురలో కలకలమా! అందులో అందఱూ కుశలురా! అంటే, ఆ కలకలీకరణములో అందఱూ ప్రవీణులని భావమా, లేక కలకలావర్తంలో అందఱును స్వస్థులని అర్థమా?

రతి : (ఆతురత నభినయించును) మధురలో కలకలమా?

నార : సుముఖులారా! రెండునూ యథార్థములే. ఇంక కొంచెము నిదానించినయెడల భామతి మూడవముగ్గార్థము

కూడా చెప్పగలదు. స్వరభారం దూరమయినప్పుడే నాద మాధుర్యము చవికిరాగలదు గదా!

రతి : దివ్యర్షీ! మీరు ఆగత అనాగత వేదులు; భామతి పరిణత ప్రజ్ఞావతి. నేను అప్రౌఢను. చెప్పండి, మా వారి కందఱికీ ప్రియమేకదా! త్వరగా నిజం చెప్పండి.

నారద : నేను చెప్పినది నిజమే. కాదు! – ఊఁ....

రతి : కాలయాపన నాపాలిట కాలయాతన అవుతున్నది. ప్రియం పలుకండి–తొందఱగా!

నారద : ప్రియంకరీ! సర్వత్రా మహానులమాటలకు ప్రియ ముదగ్గరగాను, అప్రియము దూరముగాను ఉంటుంది.

భామతి : మహానుభావా! ఈ ముదిత హృదయము ఇది వఱకే తరంగముమీది తమలపాకులాగా కల్లోల తరళంగా ఉన్నది. ఇక –

నారద : బిడ్డా! తనలోనే అంత కల్లోలముంటే మధుర లోని కలకలమునకు ఇంత తందఱ యెందుకు?

భామతి : బ్రహ్మమానసపుత్రులు మీరు. స్త్రీజన చిత్త వృత్తం మీ రెఱుగనిదికాదు. అది చూతశాఖలాగా చైత్రా నికి ఎంత పల్లవిస్తుందో శిశిరానికి అంత వన్నెచెడి చిన్న పోతుంది.

రతి : ఆడువారికి ఆరాటమూ, మగవారికి పోరాటమూ ఈరెండును సహజములే కదా!

నారద: ఆయుష్మతీ! నీవన్నది నిజము, ఆడువారి ఆరాటమే మధురలోని కల్లోలమునకుకూడా కారణము. సృష్టి ఆది

నుండి నేటిదాకా ఈ మానవీమానవచరితమును భావిస్తే ఒక విచిత్రచిత్రాంబరము మడతలువిప్పి పఱచినట్లు పొడకట్టుతుంది.

భామతి : ఆనందబంధో ! ఆ చిత్రదర్శనము మాదృశుల ప్రాకృతనేత్రములకు గోచరించదు. వాచ్యముగానైనా వినవలెనని కాంక్షింతుము.

నారద : అయితే చెప్పుదును ; వినండి : మగమొద్దులూ, ఆడుమొలకలూ అని లోకములో ఒక సుద్ది ఉన్నది.

భామతి : అవును, విన్నాము.

నారద : ఆదిలో ఏలాగో ఈ రెంటికినీ ఏక ఆలవాలము కుదిరింది. అవిచ్ఛిన్నముగా ఋతుస్నేహసేచనం జరుగుతూ వచ్చింది. ఈనిత్యాధివాస ధర్మముచేత మోడుల మోటరికం విచ్చింది. పచ్చిపట్టింది. శిఖలు చిగిరించినవి. శాఖలు సాగినవి. పసిమి వంకలు తీర్చింది. వన్నెకన్నులు వేసింది. ఆ మహాతారుణ్యావతరణములో బహిరంతర చైతన్యమంతా చెమరించి రసీభవించింది. మనుప్రకృతికికూడా మంగల్యస్థాయి కుదిరింది.

భామతి : ఓహో ! ఈ అనుక్తసూక్త మెంత ప్రబోధంగా ఉన్నదీ !

నారద : బిడ్డా ! అది ఒక అబోధదర్శనము. అపూర్వ పరిణామము. అప్పుడే, కోకిల తొలికూజితం వినబడ్డది. కొమ్మలు ప్రసవించినవి. పూలపొదుగులలో తేనె చేపుకు వచ్చింది.

ప్రపంచమంతా పసుపాడింది. చందమామ కడుపు కరిగి వెన్నెలగా ప్రవహించింది. మారుతము మలయాద్రి లోయలోబడి మందగమనము నేర్చుకొన్నది. ఈ దుర్లలిత సంఘట్టమునందే ప్రాగ్వాసనాపటలము ఛిన్నభిన్నమై, సుడివోయి అల్పాల్ప రక్తాంశలుగా సుమనఃకోశములలో ప్రవేశించింది. మను సంతానము జగజ్జంతుజాలములలో విలక్షణమై పయికి తేలింది. ఆ ప్రచండపరివర్తనము ప్రసన్నముగా జరిగిన కాలము చాలా చిత్రంగా భాసించినందున మునులుకూడా మాసముమాని చైత్రమన్నారు.

భామతి (ఆశ్చర్యము నభినయించును.)

రతి (నివ్వెఱపోయి నిలుచును.)

భామతి (స్వగతము): ఈగాథ నే నిదివఱకు వినలేదు. గురుజనముకూడా ఎన్నడునూ తర్కించినట్లు కానరాదు. నారదుని వాణి వైపశ్చితియని వినుచుంటిని. అందుకు నేడు నిదర్శనం అబ్బింది. అజ్ఞాతమైన ఈ ఆదిమ కథ ఎంతో రహస్యావబోధకంగా ధ్వనిస్తున్నది. విజ్ఞానసాగరమును పూర్తిగా ఎవరు కొలిచిరో! (ప్రకాశంగా) స్వామీ! మన మిప్పుడు వసంతోషస్సులకు సమీపంలో ఉన్నాము. ఈ చైత్రారంభముతో మఱొక కాంతావిష్కారము రానున్నదని సూచిస్తున్నారా యేమి!

నారద: కృష్ణపక్షాంతములో ప్రతిపచ్చంద్రోదయము సహజమూ, సందర్శనీయమూ కదా! ఇందు వింత యేమి కలదు!

రతి : మానిసత్తమా ! మామామగారు మధురా వాసులై ఉన్నారా !

నారద : ముగ్ధమతీ ! నేను మానము మానివేసి యుగాలు దాటినవి.

రతి : (తత్తరముతో) తండ్రీ ! ముందుగా భద్రవార్త చెప్పి, నన్ను కరుణించండి !

నారద : సుమంగలీ ! భగవంతుని భద్రమునుగూర్చి అడుగ నక్కరలేదు. శ్రీకృష్ణుడు ఏచోటవుంటే ఆచోటే మధురావాస మవుతుంది. కాని-

రతి : (సంభ్రమముతో) కాని, ఏమయింది ?

నారద : మతేమీ లేదు - కాని, మధురాపురచక్రము వక్రించిందనక తప్పదు. పుత్రభాండము అపవాదప్రవాహంలో మునిగిపోతున్నదని మీ అత్తగారు ఉత్తలపడుచున్నది. గోపిక లందఱును ఇండ్లు వాకిండ్లు పట్టక, వీథుల కెక్కి, రజ్జులాటకు దిగారు. గోపకులు గోష్ఠములు వదిలిపెట్టి దిక్కుమాములై తిరుగుచున్నారు. మగవాసనసోకితే మగువలు మండిపడుతున్నారు. ఆడది యెదురైతే అనాదరం క్రక్కుతున్నారు పురుషులు. పాపం ! ఏ వికారములూ తాకని వత్సలుమాత్రం ఇంకా విపర్యాసవిద్ధులు కాలేదు.

భామతి : నగ్నమైన శైశవములో అనాసక్తయోగం కల దందురుగదా పెద్దలు.

నారద : అది నిజమే.

రతి: నిజమా! అది యెట్లు? తల్లిదండ్రులు తారుమారు త్రోవలలోబడి తల్లడిల్లుతుంటే, పిల్లలు ఉల్లాసంగా ఉన్నారా! అది సాధ్యమేనా?

భామతి: సఖి! సర్వజ్ఞులసమక్షంలో వ్యాఖ్యానము చేయడం అవినయమంటారు; నేను అల్లా అనుకోను. గురువులు గుణవత్సలులు; అపార్థమును సవరిస్తారు. యథార్థమును తేల్చి చెప్పుతారు.

నారద: వత్సే! అదే సాధుప్రక్రమము. నిశ్శంకముగా నీ సందేహసంహితను తెఱచి చూపవచ్చు.

భామతి: ప్రేమవాదీ! శైశవము అనాసక్తయోగాంగములలో అనాహిత చక్రమువంటిది. దానిని కేవలం అప్రబుద్ధ ఇంద్రియావస్థగా పాటిస్తున్నాము. నిలిపితే అది నిలుస్తుంది. శ్రీశుకాదులు ఆ యోగసిద్ధికి దృష్టాంతం. సహజంగా పూర్ణమయ్యే అనుష్ఠానముకూడా అదే. బాలపల్లవ విన్యాసముకోసమై వనస్పతి లోకమంతా నిజచ్ఛదనముక్తమై నగ్నమవుతున్నది. ప్రకృతికూడా ఇందుకు సాక్షి. పుష్పించిన తామరకు సోముసిమీద ఈసు. అదే తామర చిన్నమొగ్గగా ఉన్నప్పుడు ఆ ఊసే తెలియదు. ఈ నగ్నప్రకరణం కృష్ణపక్షములో మనకు పూర్తిగా ప్రదర్శిత మయింది.

నారద: సాధు! గురుపుత్రీ! సాధు!

రతి: (అనాశ్వాసితంగా) త్రికాలవేదీ! మా మామయ్యగారిమాట చెప్పలేదే, మీరు వారిని చూచితిరా?

నారద: మధురలోనా—

రతి : ఆ !–మా–మన–మధురలో.

నారద : మీ అత్తగారే ఆయనను వెదుకుచున్నది. ఇక మాకు కానవచ్చుటెట్లు !

రతి : అయితే, వారు మధురలో లేరా ?

నార : త్రిరాత్రమయినదట వారిదర్శనము కాక.

రతి : భామతీ! నామనసు ఉద్వేగిస్తున్నది. మహర్షీ! మేము త్వరగా మధుర చేరే మార్గం చూపండి. ఇక్కడ ఇక నా కాలు నిలువదు. గోకులంలో పొంగలిపండుగ అత్యంత శోభాయమానంగా జరుగుతుందని విన్నాను. భామతికూడా చెప్పింది. చూడ వేడుకై భగవతిని తోడు తీసికొనివచ్చాను. కాలయాపన జరిగింది. ఎలాగయినా అనుగ్రహించి మధురకు పంపండి.

భామతి : సంయమీంద్రా ! తీసికొనివచ్చింది నేనే; కాని కాలయాపనకు కారణం నేనుకాను. జనపదముల చక్కదనాలు చూచిమెలుగని ఈ భాగ్యశాలినియే అందుకు బాధ్యురాలు. ప్రత్యూషములోనే ప్రాచితీర్చి, అనుదిన శృంగారంగా, తమతమ పూరిండ్లముంగిట గ్రామభామలుతీర్చె రంగవల్లికలుచూస్తూ, దధిమధనధ్వనులతో మిళితమై కుటీరాంతరాళములనుంచి వచ్చే యాదవీ స్వాదుగేయాలను ఆలకిస్తూ, ప్రొద్దుప్రొద్దుల పుష్కలంగా పాలు కుడిచి, పొంగి చెంగనాలెత్తే లేగలక్రీడలు కాంచి, కాంక్షతీఱక, పచ్చని పచ్చికనూ, తీయని తోయములనూ స్వచ్ఛందంగా అనుభవించి సందెకడల పల్లె ప్రవేశించు ధేనుదేవతలదర్శించి ఆనం

దిస్తుంటే దినాలు నిమిషాలుగా గడిచిపోయినవి. అయితే, ఈ జనపద పర్యటనం నిష్ఫలముకాలేదు, ఈమె మనోవైకల్యమును కొంత మఱపించింది.

(ఇంతలో, పాలకడవలు, పెరుగు కావళ్లు, తమలపాకుల గంపలు, పండ్లచిక్కాలు, మోసికొని జానపదులు చెఱకుబండ్లతో ప్రవేశము)

ప్రథముడు : (దూరము పరికించి) ఒరే! దాపటసూడు! బంగారుబొమ్మల్లాగా ఇద్దరు పడుసులు. తెల్లు కుచ్చెల మల్లే నిలబడి తంబుర మీటుతున్నాడు ఇంకోపురుసుడు. ఆళ్ళెవరో ?

రెండవ : పొద్దు జాఱుతున్నది. యీరితో మాటలు పెట్టుకుంటే బాటసాగదు. నడు! నడు!

ఒక పడుచు : అత్తో! అటుసూడు. మెఱుపు మెఱిసినట్లు మెలుగుతున్న ది-ఆపడుసు-ఎవరోగాని.

వృద్ధురాలు : (పరికించి) యెవరో పట్నపాళ్లు! యీళ్ల సోయి అంతా వాకుల్లోనూ కోకల్లోనూ ఉంటుంది. కడుపు నిండిన కనకగడ్డలు! దేముడు నీకు ఇంతంత కండ్లు ఇందుకే ఇచ్చినట్టుంది. యేడ సుశావ్ యీర్ని ! ముందుకు పద!

(చేరవత్తురు-బండ్లతో, అదిలింపుల కుదిలింపులతో)

గతి : ఈ ప్రయాణీకు లెవరో!

భామతి : ఎవరోగృహస్థులు. తర్లుపెండ్లికి పోతున్నట్లున్నది వాలకం. (పరిశీలించి, బాటసారులవైపు పరిక్రమించి) అన్నా! ఎక్కడికి ప్రయాణం.

ఒకడు: తల్లీ! దణ్ణం. తంబురవాయిస్తున్న ఆ పాటకాడెవరు?

భామతి: వారు మహామునులు. నారదభగవానులు వారే.

రెండవ : ఓహో! వోరే రంగా! రమణా! వోసే! మాచీ! మాతంగీ! రాండి! రాండి! యిదుగో-బాగోతుల బంగారం. రాండి-మొక్కండి.

(అందఱును సంభ్రమముతో కావళ్లు, చిక్కాలు దించి సమీపించి సవినయంగా సాష్టాంగపడుదురు. బండ్లు ఆగును.)

నారద : మధురా వాస్తిరస్తు. బిడ్డలారా! మీ ఆవులు లేగలు బాగున్నవా ?

ప్రయాణీకులు : (ఏకకంఠముతో) ఆ! అందఱు సల్లగా వున్నాము. అంతా మీచలవ. (అని, మూటలు విప్పికొని సంద భోజనము లారంభింతురు.)

రతి : (విస్మయ మభినయించుచు, స్వగతం) ఈ మహాత్ము డెంత ధన్యుడు! ప్రాజ్ఞులకూ, భాగవతులకేగాక ఈ జడదారి పేరు పామరులకు భగవన్నామమువలె సుపరిచితము.

భామతి : ఎఱుగవా? నారదకంఠ కాసారమందే ప్రేమ మృణాలములు పాదుకొని భక్తిభిసాసూత్రములుగా భాసించి నవి. ప్రపంచములో తీపి చిలికే భవ్యభావములన్నీ వాని పువ్వులే. ఈ మహామధుర భావము అనంతముఖముల ప్రతి ఫలించి మానవకంఠములలో సంకీర్తన శ్రుతిగా వ్యాపించింది.

రతి : భామతీ! ఎఱుగక అడుగుతున్నాను - క్షమించు. కర్మానుష్ఠానముకంటె, బ్రహ్మోపాసనకంటె సంకీర్తనా సాధన మహత్తరమైనదని నీయభిప్రాయమా ?

భామతి : మహత్తరమేనా - మహోదాత్తమని నా ప్రత్యయము. రాజసఖి! సంకీర్తనలో సర్వంకష ప్రభావ

మున్నది. అందలి నాదమూర్ఛనలో విషయవిక్షేప మాగి పోతుంది. భావనలో అంతా మధురంగా, మంగళంగా మాఱి పోతుంది. ఆ చిన్మయధారణలో సృష్టిఅంతా మమేకమై సత్వ ముఖీకృత మవుతుంది. కటు కాఠిన్యముక్తమైన ఈ కుశల వ్యవస్థనే హృదయవాదులు కాంతాయతనంగా విన్యసించు కొన్నారు. అందువల్లనే వారు ప్రణయపదమైన హృదయ మును ప్రాణేశ్వరీ ముఖచక్రంగాలక్షించి, అందు యావన్నగ్న నవ్యమైన రసమూర్తిని శాంతంగా-శివంగా-సుందరంగా-ఉపాసింతురు. ఈ వ్యాపారమందే శ్లోకబంధము మనోరమ సూత్ర మౌతున్నది.

శ్రావణుడను బ్రహ్మచారి (తెరలో)

అబ్బా! ఆరుదినములు-రాత్రులతో సహా-గడిచిపోయి నవి. యమునపొంతనే వెతుకుతూపొమ్మని గదా నన్ను ఆజ్ఞా పించినారు. పొదలు దూఱితిని, చెట్లచాటునా, కొమ్మల మాటునా పరికించి పాఱజూచితిని. ఏళ్ల కయ్యలలో-వాగుల వంచలలో- తెల్లుదుబ్బులలో - వెదుళ్ల గుబుర్లలో-శ్రద్ధగా, జాగ్రత్తగా, ప్రమాదపడక, ప్రాలుమాలక-శబ్దాలలో అర్థము లాగా-అన్వేషించితిని; పరిసరమంతా పరీక్షించితిని. కాని, శ్రీకృష్ణుడు కానరాలేదు. కానరాడా యేమి? పోనీ! నేను సేకరించిన వృత్తాంతమైనా విశేషములేదు; ఏమొగముతో తిరిగి మథుర ప్రవేశింతునూ - తోచుటలేదు. (దీర్ఘముగా ఆలోచించి) ఆ...ఒక్కటే విషయమున్నది-మఱచిపోకుండా జ్ఞాపక ముంచుకోవలసినది. కట్టక-ఈనక-ప్రాయమంతా శూన్య సుందరమైపోతున్న పడుచుపెయ్య ఒకటి కనబడ్డ కుమార

వత్సముల వెంటబడి, రేళ్లూ-పగళ్ళూ-తిరుగుతున్నదనీ, దాని మరులు మాన్పలేకా, దీనావస్థచూచి సైపలేకా, ఆప్రాంతపు గొల్లలు గోపాలకునితో మొఱపెట్టుకుంటే, "నేను తప్పక వచ్చి చూతున"న్నాడనీ వృద్ధయాదవు డొకడు చెప్పెను. అయితే, ఆ వృద్ధుని ఊరూ పేరూ అడగడం మఱచిపోతిని. ఇది ప్రమాదమే! (పాడుచున్నాడు)

శ్రుతులలో స్వరములు సుఖియింపనేలో
మమతలో మధురిమల్ రమణింపనేలో

ఏమిచెయ్యాలె!...సమీపములో ఏదో సందడిగా ఉన్నది!

(పరిక్రమించును)

భామతి: మహర్షి! వింటిరా! అది మా గురుకులతీర్థుని కంఠము. శ్రావణుడు. తమ్ముడా!

శ్రావణ: (తొందరగాను-మందముగాను మిశ్రచేష్ట లభినయిస్తూ) అక్కయ్యా! గోవిందుని - ముకుందుని - రాధారమణుని (నోరొత్తుకొని) వాసుదేవుని దర్శనమై నేటికి ఆరు దినాలు. నన్ను వెదకపంపిరి. నేను-

భామతి: నీ స్వగతమంతా మేము విన్నాము. అయితే...

రతి: భామతీ! ఇకమీద ఒక్కక్షణమైనా నే నిక్కడ ఉండలేను; ఉండను! మధుర చేరితీరాలె! మనవార్త పోవడమూ-రథం రావడమూ, అనాలోచితం. ఏదైనా సరే-ఉపాయంచూడు. నీపుణ్యం.

(ఇంతలో, గొల్లలు చల్దులు తిని, మూటలు సవరింతురు.)

నారద : బాలికలారా ! ఎందు కింత ఆందోళన ! సంతకు వెళ్ళుచున్న ఈ గోకుల జానపదులు మీయిద్దరినీ అవశ్యం ఇల్లు చేర్పగలరు.

జానపదులు : (ఒకరి నొకరు త్రోసికొని వచ్చి) బాబూ ! స్వామీ ! అంపండి! పంపండి! యెరువు సొమ్ముల్లాగా-దేవుడి ముడుపుల్లాగా-బద్దరంగా తీసుకపోయి అప్పగిస్తాము !

రతి : వీరు మమ్ములను ఎల్లా తీసుకొనిపోగలరు ?

నారద : ఒక పాలకావడి ఖాళీచేయుదురు- మీరిద్దఱును చెఱి ఒక చిక్కములో కూర్చొనవచ్చును.

రతి (చిఱునవ్వుతో కన్నులు వాల్చును)

భామతి : కాదు ! కాదు ! దేవీ ! నిన్ను చెఱుకులబండి యెక్కిస్తాగు. నిమ్మళంగా పరుండవచ్చు. మథుర చేరిన తరువాత——

నారద : భర్తకు బండెడు పచ్చవిండ్లు వాయన మీయవచ్చు !

రతి (లజ్జనభినయించుచు తలవంచుకొనును)

భామతి : (నవ్వుచూ జానపదులనుచూచి) అన్నలారా ! సరిగా చెప్పండి : బిత్తరిల్లిచూస్తున్న ఈ కాటుకకండ్ల కోడెల బండి మంచిదా - వెండిబొమ్మలవలె నిలబడివున్న ఆ తెల్ల గిత్తలబండి మంచిదా ? మా రతీదేవిని ఎందులో ఎక్కించుకొంటారూ ?

ఒకడు : చెల్లెమ్మా ! (నాలుకకఱచి) తల్లెమ్మా ! ఎంత కనిపెట్టి తోలినా కోడె నడకలో కులుకూ-బెళుకూ వుంటుంది.

గి త్తలు సూడిపెయ్యలు నడిశినట్లు ఒడుదుడుకులు లేకుండా పోతై. అదిగాక, చెఱుకు మోపులమీద అరిటాకు కట్టలున్నై. ఆటిని యిప్పి సక్కగా సదురుతాము. చల్లని పచ్చికపడకల్లే వుంటుంది. వాళ్లు అదరకుండా నిదరపోవచ్చు.

శ్రావణ : ఇది బాగున్నది. అక్కయ్యా! మీరు ఇల్లు చేరండి.

నారద : వత్సా! నీవు నాతో రమ్ము. ఈ యమునా కూలమందే తులసీ కదంబవీథులు కొన్ని కలవు. వానికి దక్షిణముగా ఒకటి రెండు సుప్తసరస్సు లున్నట్లు వింటిని. అప్పుడప్పుడు ప్రాంతవాతపోతములతో వచ్చే సరళస్వరములను మా మహతి ఆకర్షించింది. ఆ వాడలుకూడ వెదుకతగినవే.

శ్రావణ : చిత్తము.

నారద : బిడ్డలారా! మీరిక బండ్లెక్కండి. ఓయీ! ఆడు పిల్లలు భద్రం.

(రతీ, భామతీ మహర్షికి నమస్కరించి యథోక్తంగా ఆసీను లగుదురు. జానపదులుకూడా నారదునికి మొక్కి బండ్లతో సాగివెళ్లుదురు)

(నారద శ్రావణులు నిష్క్రమింతురు)

## రెండవ రంగము

### సుందరుని మందిరం

(ప్రాక్పశ్చిమ కుడ్యములలో నిలువుటద్దాలు, మనోహరమైన చిత్రాలు, శిల్పప్రతిమలు, అందందు గవిసెనలలో వీణామృదంగాది జంత్రములు, చదరంగపు పీట, అడ్డసాళ్లు-ఇత్యాదులు

సుందరుడు (బాలీసుమీద అర్ధోద్ధానంగా)

అహో! నా హృదయము నేడు హోరని మ్రోయు ఘోర పారావారంగా మారింది. త్రుళ్లుతూ సుళ్లుతిరిగే తరంగాలు అభంగురంగా ఆకాశ మెత్తున లేస్తున్నవి. విరిగికూలే వీచీ తండము పాతాళగర్భమునకు చొచ్చుకొని పోతున్నది. అబ్బా! సహింపలేను. విశాలమైన రోదస్సును వదిలిపెట్టి, వాతజాతమంతా నావైపే తిరిగింది. నా చిత్తభిత్తికలు ఇక ఛిద్రములుగాక తప్పదు. (ఇంచుక ఆలోచించును)

కటా! నాభావ మెక్కడ? కూడీకూడని పాలలాగా పంకప్రాయ మవుతున్నది. వెన్నవలె కరిగే హృదయం పాషాణములాగా పగిలి పలుకు లవుతున్నది. (నిట్టూర్పు విడిచి) ఊహాలన్నీ నల్లత్రాచువలె చుట్టలువిప్పి తలలెత్తుచున్నవి. ఇంతటి ప్రచండ ప్రత్యుత్కర్షకు కారణమేమి చెపుమా! (దీర్ఘంగా ఆలోచించును)

నా ప్రవర్తనతో జోడించి ప్రపంచమునంతా వెదికినా తగినంత బలవత్కారణం కానిపించదు....ఉన్నది! ఒక్కటే: మొన్నటిదినము నేను అనుభవించిన అనిచ్ఛావిపర్యాసమే కారణం కావలెను. అయితే, ఆనాడు నా మనోరథం

క్రుంగిందా ? కూలిందా ? లేక, అసలే తునకలు తునకలై విరిగి వికలమయిందా ? ఏమీ కాలేదనుకొన్నానే! అలా గయితే ఈ భయానకమంతా ఎందుకు సంధిల్లింది ?

(నిమీలితుడై - భంగపాటు నభినయిస్తూ)

సుందరమనోరథమా ! నీవు తాకని శృంగార శిఖరము లేదు ; తిరుగని కాంతావరణం కానరాదు. పుణ్యాంగన లైనవారి పూజలు కాకపోయినా, ఫుల్లావలోకనాభిషేకం జరిగింది. ఇంత ఎందుకు – యౌవన చైత్ర మిత్రోత్సవంలో నీదే పల్లవ పథము. (లేచి పరిక్రమించి) ఏమీ పాలుపోదు. నా విస్రంభచక్రమే వక్రించినట్లున్నది. లేకపోతే, ఈ వ్యత్యస్త గమకం ఎందుకు తగులుతుంది ? (ఊర్పు నిగుడించి కుడ్య చిత్రాలపై చూపులు నిలుపుచు)

ఆహా! సమానులందఱూ సుందరుడు చరితార్థు డన్నారు. అట్టి నాకు, నాగరకవ్రతినైన నాకు, సౌందర్యార్చనా పరుడనైన నాకు, మాధురీ ముఖ పిపాసువునైన నాకు, నేటికి ఈలాంటి భంగపాటు అంతరాంతరాళముల నంటేలాగా నాటింది. అందులోనూ ఈ నిశాతపాతం వకుళమాలా ముఖంగా వాటిల్లడం వింతలలో వింత; విపరీతాలలో విపరీతం. (స్మృతినభినయించి) ఆమెకు జనకులు పెట్టిన పేరు ప్రమీల. మా స్నేహపీఠికలోనే ఈ ఆభరణాభిదానం అబ్బింది. ఒకనాడు వేతసీ నికుంజములో ఒత్తుగారాలిన పొగడపూల మీద ఉభయులమూ ఉండగా తాను నవ్వింది. చెక్కిళ్ళ మీద సిగ్గో, సింగారమో శ్రీకారములు పెట్టుతుండగా 'ఏదయినా ప్రియమైన పేరు పెట్టండీ నాకు' అని అన్నది.

అప్పుడు ముఖమునిండా చక్కదనాలు పిక్కటిల్లినవి; కంఠములో కమ్మనీరు జున్నుగడ్డలు కట్టింది; శబ్దకోశమే నవ్వుతూ విప్పారి మధురార్థం వెదచల్లుతున్నట్లు స్ఫురించింది. ఆ పుణ్యతరుణంలో 'వకుళమాలా' అని అభిరామ నామమాల అల్లి ఇచ్చాను. (కొంతసేపు స్తంభనపడి) ఆహా! స్మృతి యెంత సుతారమైన పాశమో! దిక్కాలావిచ్ఛినంగా అప్పటి అనుభూతివీథులను ఇప్పుడు వెదకి బంధిస్తున్నది. ఆస్వాదించిన అమృతరుచులను చవికి తెస్తున్నది. నిజంగా స్నేహభాండమును మోసిన ముదితులైన మిథునములే ధన్యములు. అందునూ మాసాంగత్యము ఎంతో ఉభయాభిప్రేతంగా, కామ్యకామితంగా కందళించింది. కాంత వచస్కులయిన కవులు దానిని గేయంచేస్తే ఏ మోహనరాగంగా రక్తి తేలుతుందో, ప్రాణివీథులను ఎంత స్నిగ్ధులను చేస్తుందో ఊహింపలేను. ఓహో! ప్రాణి అనుభవము, అందునూ ప్రణయప్రాభవము ఎంత గొప్పదీ! ఎంత గుప్తమైనదీ! (దీర్ఘచింతన అభినయించి) అయితే, ఈ అనుభూతి వకుళకును, నాకును అద్వైతప్రాయంగా అందిన అనుభూతి. మిథునాన్వితంగా భుక్తం కాలేదా? లేక, ఈ కుశలక్రీడలో ఆమె నాకు వినీతసహచారిణిగా మాత్రమే అనువర్తించిందా? ఏమీ! నా కామితక్రతుసిద్ధికై స్నేహాహుతి సమర్పించిన వకుళ తన జీవతాన్యాత్రిక భగ్నంచేసుకొన్నదా? అయితే మా ప్రియచయనము ఉభయసమాసంజితంకాలేదుకాబోలు! కాదు, అట్లుకాదు. ఆ శంకకు అవకాశం లేదు. వకుళను సుందరు డెఱుగును; సుందరుని వకుళ యెఱుగును. అదికాదు,

నిజంగా మా ప్రణయసమారాధనలో అరిష్ఠపాత మయింది. హేతువు వ్యక్తం కాకపోవుగాక! ఆ ఘాత మొట్టమొదట వకుళకు తాకింది. ఇప్పుడు నా పట్ల వివర్తమైనట్లున్నది. నా యాక్షోభకు సమన్వయం వస్తున్నది. కటా! వకుళ జీవిత త్యాగము సుందరునికి జీవిత భోగంగా పరిణమించినదా? ఇది దుష్పరిపాకము.

పరంజ్యోతి (ప్రవేశము, చేతిలో చిత్రసంపుటితో)

కాంతాలోకమును కవిసి, క్రమ్ముకొని కీలాభీలం చేస్తున్న నేటి కల్లోలానికి ఆదీ, పాదూ స్పష్టం కావడములేదు. దీని కీలకమేమిటో అసలే అవగాహం కాదు. చెలికాడు సుభాషి అన్నాడుగదా: వాస్తవం కనిపెట్టాలె నంటే కుందకాసార మును చేరి, చెంపగా నిలిచి భామాలాప కలాపమును ఆలకింప మన్నాడు. అయినా సుందరు డేమనుకొంటున్నాడో చూచి పోదును. (ఇల్లు నలుప్రక్కలూ తిలకించి) సుందరి మంచినీళ్ళకు పోయినట్లున్నది. సుందరుని చిత్రశాల మూసి ఉన్నది. అదిగో లోపలినుంచి ఏదో స్వరము అలసాలసంగా వినబడు తున్నది.

సుందరుడు (లోపల) : మజిల హృదయంలో స్పందిస్తున్నది వకుళ పాట. వద్దనుకొన్నా ఆ గేయ మకుటపదాలు పునః పునః పల్లవితము లవుతవి. (పాడుకొనును)

కనవోయి సఖుడ! ఈ కనరాని సుఖశోష
చూడలేనంతంత శోషిల్లు నీరేఖ......

జ్యోతి: (వినుట నభినయించి) ఆహా! పన్నీటి బుంగ బోర గిల్లినదా! చందనాచలము చెమ్మగిల్లి చిలపలై దిగుతున్నదా!

ఏమిా ఇతని కంఠము. సురూపానికి తగిన సుస్వరం; సుస్వరానికి తగిన సుకుమార హృదయం. సుందరుడు సుకృతి. ఇతనిని కన్నతల్లి ధన్యురాలు. (కవాటమును తట్టుచూ) సుందరం తలుపు తీస్తావా ?

(సుందరుడు గదిలోనుంచి ఆలకించి) జ్యోతివలెనున్నాడు (అని లేచి కవాటము తెరుచును)

జ్యోతి : మిత్రుడా? ఏమో పాడుతున్నావు. చిత్తమంటే నీదే చిత్తము. ఇంటివసారాలో చిలక వ్రాలినా, మింటిమిాద ఋభువు రాలినా నీచిత్తం వణకదు; తొణకదు.

సుందర : జ్యోతీ! పాట విన్నట్లున్నావు. అందేమైనా విశేషం ధ్వనించిందా ?

జ్యోతి : ఆ! ఏదో మార్పు లేదనలేను. కాని, ఆభేదం చెప్పడానికి శబ్దము చిక్కడములేదు. లేగడిపాల తీపికీ, తలిపిపాల తీపికీ ఏ భేదం కలదో అది చవికి తగులుతున్నది. ఇదివఱకు ఒకసారి మనము మాధురీస్వరూపమును మిామాంస చేశాము. జ్ఞప్తికివస్తున్నదా? వేణువుకున్న బెజ్జాలు సన్నగా ఉన్నా, వెడల్పుగా ఉన్నా నాదమాధురిలో లాఘవ గౌరవాలు ఘటిల్లవని నిరూపించావు. కాని, నాకు ప్రత్యయం కలగలేదు. అప్పటికీ ఇప్పటికీ!! పూర్వవిప్రలంభములోనూ, ఉత్తర విప్రలంభములోనూ స్థాయికి పాదు మారదని నేనెఱుగుదును. అయితే, అంతర మేమిా లేదనలేకుండా ఉన్నాను. ఎందుకంటే, సాగరసంగమావేగంతో విభ్రమించి సంమేళనమందిన స్రవంతి ఉత్తరావర్తనలో తప్త సంతప్తమై ఆవిర్లుపాటి పయోధరోత్సంగము నాశించుచున్నది. అది అల్లా ఉంచు; నీ

కంఠము నాకు చిరపరిచితం. ఆలాపచ్ఛాయలుకూడా అపూర్వములు కావు. నేడేదో మార్పుతగిలింది. తారా కలశాలలోని జ్యోతిర్లావణ్యము నీరంధ్ర నీరద నీలావరోధంలో చిక్కుబడి మీలితోన్మీలితమగుతున్నట్లు నీ కంఠస్వరజాతం నేడు ఒకానొక రాపిడిలో, రభసనలో పరుష సరళపర్యాయంగా మ్లానామ్లానతారళ్యమును వెళ్లగ్రక్కుతున్నది. నేదకుముందు చెల్లాటం ఉండకపోదు.

సుందర : జ్యోతీ! ఈ గేయము నవనీతునిది. ఆతడు గడచిన శుక్లప్రతిపత్తునాడు ప్రత్యేకంగా వచ్చి వినిపించాడు. నేను విన్నాను; పాడి పాఠంచేసానుకూడా. నాటినుంచీ రుచు లెక్కలేకు లెత్తిన మధుమాస రసాలులాగా ఈ గేయము అనుదినముదితంగా విస్తరించి వ్యాపించింది. ఇప్పుడిది కాంతాజనమునకు కర్ణాభరణమేగాక కంఠాలంకారంకూడా అయింది. కారణమేమందువు!

జ్యోతి: ఈవాగర్థలీలలో, దాని రాగభంగిమలో వారి అంతఃకరణ అపేక్షలను తీర్చి, తీపార్చే ఆప్యాయన స్పందనమేదో ఉండి ఉండాలె. లేదా, ఆకస్మికంగా, అవ్యక్తంగా చక్కలిగింతలుపెట్టే సతీసహజహృదయమృదులవిన్యాసమేదో ఈ పదాలాపనలో స్మృతికి తగులుతూ ఉండాలె. మొత్తానికి నారీనరప్రణయ ప్రసక్తమైన ఒకానొక ఆకూతం అభినవంగా ధ్వనిస్తున్నది. నీవు దీనిని ఆకాంక్షించలేదా ?

సుందర : నీవన్నట్లు ఈ కాంతా కలకలమునకు గాఢమైన కదలిక ఎక్కడనో ఉండితీరాలె. లేకపోతే ఇంతవశంగాని ఉద్రేకం వారిని ఆవేశించదు.

జ్యోతి : నిజం. నారీచైతన్య ప్రస్థానంలో ఇది ఒక విపరీత కాండ. వారి జీవితమే మరులెత్తింది. కానరాని యేదో ఇష్టార్థంకోసము వెదుకులాడుతున్నది. ఇదంతా వెఱ్ఱిగా, వంకరగా వితర్కించడం తప్పు. అనంతమయిన మానవీ మానవ జీవితచాలనలో ఇలాంటి ఇష్టానిష్ట ప్రకరణాలు చాలా సంఘటిల్లి ఉండాలె. అలాంటిదే ఇది ఒకటి. సుందకాసార నితంబమున నన్ను కలిసికోమన్నాడు సుభాషి. అక్కడ ప్రచ్ఛన్నంగా ఉండి, స్వచ్ఛందముగా జరిగే పౌరసతీ సంభాషణలో ఏమయినా గుర్తింప వీలవుతుందేమో చూడాలె. ఎవరో శ్రుతాశ్రుతంగా మాట్లాడుతూ పోతున్నారు వీథిన .........(అని నిష్క్రమించును, సుందరుడు తలుపు మూసుకొనును)

(సుందరీలీలలు బుజాల బిందెలు పెట్టుకొని వచ్చుచుందురు. మఱి కొందఱు స్త్రీలును నీళ్ళుతీసుకొని వీథివెంట సందడింతురు. సుందరీలీలలు ఇరువురు ఒకవాకిట నిలబడుదురు)

సుందరి : లీలా! వెళ్ళుదుగానిరా! మాయింటికివస్తే మీ అమ్మ ఏమీ అనదులే.

(లీల ఇంచుక నిలబడి 'సరే' అనును. ఇరువురును సుందరుని మందిరమును ప్రవేశింతురు. సుందరి మంచినీళ్ళ కడవను పరిశుభ్రముగా అలికి ముగ్గులు తీర్చిన వేదికమీద దింపి, దానిమీద తుహినధవళమగు వస్త్రమును కప్పును. లీల తన కడవను ఓరగా దింపి పెట్టి, పైటతో ముఖము తుడుచుకొనుచుండును)

లీల : (అటునిటు పరికించి) సఖీ! బావ ఇంట్లో ఉన్నాడా?

సుందరి : నాలుగురోజులనుంచీ కళాదీక్షలో నున్నాడు. ఒక గేయానికి స్వరక్రమణిక కుదురుస్తూ, గదిమూసుకొని అదే తన్మయ కృషి చేస్తున్నాడు. రా–మనము తోటలోకిపోదాము.

(ఇరువురూ దొడ్డిలో పెరిగి పూచి కాచి నేత్రపర్వంగా ఉన్న ఉపవనం ప్రవేశింతురు. ఒకతావున బాగా ఆకులతో, కొమ్మలతో గుబురుకొన్న గున్న పనస-తొలికాన్పున కాయలుదిగి ఉన్నది-పచ్చి అరటిచాలు, అక్కడ ఎఱుపు తెలుపు రాల ముక్కలతో గళ్ళు గళ్ళుగా స్థగితమైన వేదికాఫలకం. దానిమీద కూర్చుందురు)

సుందరి : చెలీ! చెప్పుతూ అపివేశావు. తరువాయి చెప్పు. నిజంగా సుభాషిమీద...

లీల : (శీఘ్రంగా అందుకొని) సుభాషిమీద నాకింతసూడు కూడదన్నావు; మళ్లీ అంటున్నావు; ఇక అనబోకు! అనసని బాస తిను! అంతరంగమంతా రక్కెసిస్తున్నది వివిక్త వేదన. నాలోపల క్రిక్కిరించి, కక్కసమాడుచున్న కపట, కలుష కథ వింటే నీవు ఇలా అనవు; అనలేవు. ఆలకించు. ఆ నిష్ట కష్ట కలాపం కక్కివేస్తాను. కొంత ఉబుసు తగ్గుతుంది.

సుందరి : లీలా! మాటవరసకు అన్నాను. నిజంగానే మిత్రులలో ఎడమొగాలు, పెడమొగాలు వస్తే నాకు బాగుండదు. స్నేహనికుంజం చిన్నపోతుంది. వకుళ ఎందుకో మాయింటికి ఇప్పుడు మునుపటివలె రావడంలేదు. అది వచ్చినప్పుడు ఇల్లంతా పరిమళిస్తుంది. ఎన్నోసార్లు అనుకొంటాను. కాని, సుభాషి సహవాసమార్గంలో గోతులున్నవని నే ననుకోలేదు.

లీల : ఎల్లా అనుకొంటావు. అతని వాలకమంతా అలాటిదే. విశ్వాసమూలములేని విస్రంభ వృక్షచ్ఛాయగా నమ్మె. సుభాషీ, నేనూ సాందీపగురుకులంలో దాదాపు పదేండ్లు శిక్ష పొందాము. అనేక పర్యాయములు నృత్యభంగిమలు

నాకు కుదరకపోతే తాను అభినయించి, చూపి, స్వయంగా నా కరచరణములను పట్టికొని చారణ విన్యాసం చక్కపెట్టి, సవరించి నేర్పేవాడు. అలాటిది మా చనువూ, చెలిమీ. అనధ్యయన ఋతువులలోకూడా మాకు విడుపు ఉండేదికాదు. ఎల్లాగంటే. నాకూ, అతనికీ మాతామహగ్రామం ఒక్కటే. మా చిన్నమామయ్య ఆరితేరిన నాట్యాచార్యుడు. నా నాట్యాభ్యాసములో కొంకుకొఱతలు దిద్దుతాడని నన్ను పంపేవారు. అతడుకూడా అక్కడికి వచ్చేవాడు. ఇల్లాగా విడుపూ, తుడుపూ లేకుండా మేము కలిసిమెలిసి, పొరుపూ మఱుపూ లేని సావాసవ్రతం జరిపాము. మామిళ్ళు పల్లవించినవి; తామరలు తలలు వాల్చినవి; కలువలు కళకళలాడినవి; తరుణతరులు ముదిసినవి. కాని, మా నేస్తంమాత్రం తియ్యని తేనె తేటలాగా, అవికార ముక్తాలావణ్యంలాగా, అపరిష్కృత ప్రియంగా, అనవగీత వినయంగా ప్రవర్తిల్లింది. నేను ఉద్వాహితనై అభిజనగురుకులములను వదలి స్వగృహంచేరాను. అప్పటినుంచీ, ఎప్పుడైనా, ఎక్కడనైనా, కాదాచిత్కంగా కలుసుకొంటే (పెదవికఱచి) క-లి-స్తే-సుభాషి (కొంచె మాగి) చెప్పనా చెలీ, చెప్పనా...

సుందరి : చెప్పాలె లీలా! చెప్పితీరాలె. ఒట్టుసుమీ కప్పిపెట్టుకొన్నదంతా చెప్పాలె. నీధోరణి అంతా విచ్చీ విచ్చని పచ్చిమొగ్గలాగా, స్ఫుటాస్ఫుట ముగ్ధంగా ఉన్నది. అది అలా ఉండగా, కప్పురపు పలుకుల్లాగా నీకన్నె పలుకులు కమ్మదనాలు విసిరి కరిగిపోతవి. అవి అనుభవించడంకూడా భాగ్యమే. దాచకుండా, సంకోచించకుండా చెప్పు...అంతా...

లీల : సుందరీ! దాచను; చుక్కంతకూడా దాచను... కాని...నీ కడుపులో ముడుచుకొంటావు కాదూ...లక్ష వత్తులతో-లలితావరణ సలక్షణంగా-అక్షయ దీపారాధన చేసిన అమృతశీలవు. నీ సమక్షంలో నా హృదయ భాండమును కులదేవతముందు కొబ్బరికాయలాగా పగులగొట్టి వేస్తాను. అప్పుడు...నా అంతఃకరణం ఎంత ఉడికిపోతున్నదో తెలుస్తుంది. చెప్పనా. నీకు చెప్పకుండా ఉండలేనుగా...విను. నీ వివేక కర్ణములువిప్పి విను. సుభాషిచూపులు మాఱినవి. మునుపటివలె శుభ్ర సూత్రాలుగా లేవు. వక్ర వాగురుల లాగా వ్రాలసాగినవి. చేష్టలలో, సైగలలో వెనుకటి విమల విలసనం లేదు. ఏదో అవచనీయమైన సంవృత విన్యాసం సంక్రమించింది. ఇంత ఎందుకు. మాచిరంతన స్నేహదోహదంలో మామూలుగా సుమాళించే సుముఖీభావం పలచపాఱింది. అయినా, మాఅంతఃకరణాపేక్షలు పురివిచ్చుతున్న సూత్రాన ముత్యాలవలె కొన్నాళ్లు విడిపోకుండా ఉన్నవి. కాని...సుందరీ... చెప్పనా.

సుందరి : చెప్పవే! ఇంత అనుమానముంటే ఎలా...

లీల : అనుమానం కాదే...

సుందరి : సిగ్గా! భయమా! ఏమిటి మఱి; నాముందఱనే నీకు ఇంత వెనకా ముందులా!

లీల : కాదే...మొన్న మాపిన్ని నన్నుచూడవచ్చింది. ఆమెతో నేను సంక్రాంతిపండుగకు వచ్చాను. ఆనాడు సుభాషికూడా ఊళ్ళో ఉన్నాడు. ఆతని పెండ్లికి శుభలేఖ

తెచ్చిన పురోహితుడుకూడా తిరిగి పోలేదట. వారియిల్లు వెల్లవేసిన క్రొత్తశోభతో, పచ్చతోరణాలతో పెండ్లికళ కట్టింది; చూచాను. సంతోషం పట్టలేకపోయాను. పెండ్లి ఎవరిదే అంటే 'సుభాషిది' అన్నది మా చెల్లి. ఆమీద నాకు కాలునిలువ లేదు. గడపలు దిగుతూ, పెండ్లి కూతురిపేరేమిటే అన్నాను. 'సుగాత్రి' అని శుభస్వనంతో చెప్పింది. గబగబా వెళ్లి వారింటిలో వ్రాలాను; సుభాషి ముఖ మెలా ఉందో చూతా మని. అతడు ఇంట్లోలేడు. ఎప్పుడు వచ్చావోయ్ అంటూ ఎదురువస్తున్న సుభాషి అక్కగారితో 'ఇప్పుడే, ఇప్పుడే' అంటూ దొడ్లోకి దూకాను. వంగిన మల్లెపందిలిని ఎత్తి చక్కదిద్దుతున్నాడు అతడు. చుట్టుప్రక్కల ఎవ్వరూ లేరు. 'చంద్రవంకవలె ఉన్నదే నీకు నచ్చలేదా' అంటూ అతని చేతి లోని మల్లెకొమ్మను అందుకొని పైకెత్తపోయాను. ఊ—ఆ— అనకుండా ఆపడాన...నా...చుబుకం పుణికి ముద్దెట్టు కొన్నాడు...(ఉత్కంప నభినయిస్తూ) ఆనాడు – ఆహారలో – ఉత్తరావస్థ ఏమో అయిపోయింది నాకు. చైతన్యమంతా సమ్మూర్ఛమై స్తంభించింది. సర్వేంద్రియములునూ శకల ములై, వికలములై, విశృత వికార విన్యస్తములై వెల వెల పోయినవి. చూపు ప్రసరింపదు; కాలుచేతు లాడవు. బుద్ధి జడీ భవించింది. దిక్కులూ, దిగంతరములూ, మొత్తము జగ త్తంతా కాటుక పూసికొన్నట్లు తోచింది. వాయు సంచాల నమే ఆగిపోయినట్లయింది. అది భ్రమమో, భయమో, ఉత్పాతమో, ఉన్మాదమో అప్పుడేమీ తెలియలేదు. ఆ నిబిడ జడావస్థలో ఎంతసేపున్నానో తెలియదు. కించి దవబోధ

మయింది. ఇంచుక స్మృతివచ్చింది. అటూ, ఇటూ చూచాను. ఇతరు లెవ్వరునూ కనబడలేదు. సుభాషికూడా అక్కడ లేడు. బావివద్ద స్నానంచేస్తున్నాడు. (పెదవి కఱచి) ప్రియాపమానక్రతువుకు అఘమర్షణస్నానం చేస్తున్నాడేమో! అతని ముఖారవిందము వైపుకు మనసు మళ్ళింది. కాని, బుద్ధి తన విశుద్ధహస్తముతో అడ్డగించి ఇంటికి దారి చూపింది. ఇంతలో మా అమ్మ పిలిచింది...

సుందరి : అనిచ్చాపల్లవమైన అశోక శాఖలాగా తేలావు. తెలిసింది. దుర్విదగ్ధుల స్నేహ కైతవమూ, దాని ప్రతిఫలంగా అబలలకు కలిగే తీవ్ర తీక్షణ తనుత్రాసమూ తెలిసింది. భయంకరమైన ఈ మానభంగ బీభత్సమును పురుష వృషభ స్వభావం గ్రహించలేదు కాబోలు! ఎన్ని పాపాలకో ప్రాయశ్చిత్త శిక్షలు వ్రాసిపెట్టారు. గొంతుకోయకుండా, ప్రాణాలు తీయకుండా జీవిత హత్యచేసే ఘాతుకులను వారెఱగరనాలెనా? తనుతరమసృణ తరుణములైన అభిమాన మృణాలములను నలిచి, మెలిచి, కొరికి, వేధించి బాధించే మదపు టేనుగులు జ్ఞాపకం వస్తున్నవి. నేటి హృదయవాదులైనా అంతఃకరణ ప్రాతీతికమయిన ప్రతిపత్తిని గౌరవిస్తారా? ఏతత్ దోష దూషణాపచారములకు తగినశాస్తి విధిస్తారా? చూడాలె...

లీల : ఆ అపూర్వ మీమాంస అల్లాడుంచు. ఆ సూక్ష్మ పరిష్కారం వదులు. 'ఒక్కతీగ రెండు పాదులలో అల్లుతుందా'...

(నేపథ్యమున పరంజ్యోతి)

ఓహో! నారీజన నిజాంతరాళం ఎంత సున్నిత మయినదో, ఎంత శుచిమంతమైనదో ఇంతవఱకూ మహాయుగములు గడచినా గ్రహింపలేక పోయినాడు నరుడు. లేదా గమనించి గుర్తించడానికి దివ్యమైన తన జిజ్ఞాసాదీప్తిని అటు త్రిప్పలేదు. ఆ మహా సుముహూర్తం ఇప్పుడు సమీపించి నట్లున్నది...

లీల : ఇక నేనుపోతానే. నీ కడుపులో దాగాను.

(అని, నీళ్లకడవ నెత్తికొని నిష్క్రమించును)

(తెర వ్రాలును)

## మూడవ రంగము

పరంజ్యోతి పాదపాంత సంఛ్ఛన్నంగా ఉండును. సుగంధీ వకుళలు ప్రవేశము.

సుగంధి : వకుళా! సుందరుని లావణ్యావికాసములు శీతాచల శృంగములమీది కుమార సమీరములవలె పలచ పలచనై తేలిపోతున్నవి. ఆతని కషాయ కలకంఠంకూడా రసాతల కుంభపాతారవంలాగా కృపణ కృపణమై కృశిస్తున్నది. అనుత్సాహమూ, అనపేక్షా ఆతనిని ఆవహించినట్లున్నవి. దీనికంతా కారణం నీ నిరాదరణ, నిరాకరణాలని మేము అనుకొంటున్నాము. ఉభయ మిత్రకులంకూడా అలాగే ఊహిస్తున్నది....సరే కాని, నీవు సుందర సహకారమును ఎందుకు త్రుంచివేసావు? నాతోనైనా చెప్పగలవా?

వకుళ : మా సాంగత్యము విచ్చీ విచ్చని పచ్చిమొగ్గవలె అతి సుతారమైనది. అది అనుకూల పవనంతో తాకి తాకని ఉపలాలనంలో ప్రియంగా పెరిగింది; ప్రతికూల పరిపీడనలో విరిగింది. తోడి ఆడబడుచువుకాబట్టి నీతో చెప్పాతాను. చిత్త సంపుటము తెఱచి లోపలదాచు; మూతతీయకు.

సుగంధి : అలాగే లేవే. నీ రహస్యాన్ని నా మంగళ సూత్రంతోపాటు కాపాడుతాను. నమ్ము. నమ్మలేవా?...

వకుళ : ఆఁ...(స్మృతి వికారం అనుభావంలో కానరానీక) అవును. సుందరుడూ, మా సోదరుడూ సాందీప గురుకులంలో సతీర్థులు. ఎఱుగియుందువు. అతడు అప్పుడప్పుడు మాయింటికి

వచ్చేవాడు. తమ్ముడితో కలిసి పాఠం చదువుకొనేవాడు. అతని కంఠంలో నాదభారతి మాధురీక్షీరమథనం చేసేది. వినేవారి అంతఃకోశాలన్నీ కమ్మగిల్లి కళలంటేవి. పద్యం చదువుతుంటే గతిగమకాలు చెఱుకు కనుపులవలె విరిగి భణితి పాలు కారేది. ఆ పాలమీది నురుగులాగా పదవాక్య విరచనమునుపాలించి నవనీతంవలె కవిభావం తీసేవాడు.

సుగంధి : (వకుళ వక్కాణమును వింటూ పరవశమగును)

వకుళ : చెలీ! వింటున్నావా? పరధ్యానంలో పడినట్లున్నావు వినవే–విను–ఊఁ కొట్టు.

సుగంధి : (కుదిరికొని) సఖీ! ఆలకిస్తున్నాను ; అవధానంతో ఆలకిస్తున్నాను. సుందరుని కలకంఠం, వకుళ ముఖగంధం కలిసే టప్పటికి మత్తు చల్లినట్లయింది. మరేమీ లేదు. తరువాత...

వకుళ : ఒకనాడు గురుపుత్రి శుచీదేవి మా యింటికి వచ్చింది. మావదినే, నేనూ ఆమెకు అర్ఘ్యపాద్యాదులు ఇచ్చాము. ఇంతలో అతని కంఠస్వరం వినవచ్చింది. 'అతడు సుందరుడే కాదూ' అన్నది గురుపుత్రి. ఔనన్నాను నేను. 'సుందరం ఇల్లారా, ఈమధ్య నీ మధ్యమావతి వినలేదు. భ్రమర గీతలు పఠిస్తావా?' అన్నది. (సుగంధి అనవధానమును పరికించి) ఊఁ కొట్టవేం. అనభిముఖ మవుతున్నట్లున్నది చిత్తం.

సుగంధి : వకుళా! నీ కథాకథన కౌశలం కొంతా, విషయ మధుర విన్యాసంకొంతా నన్ను అవశురాలిని చేస్తున్నవి. ఆఁ...తరువాత ఏమి జరిగిందీ!

వకుళ : సుందరుడూ, మా తమ్ముడూ లోపలికి వచ్చారు. గురుపుత్రికి సాష్టాంగ నమస్సులు సమర్పించారు. సుందరుడు గురుస్తుతి కావించి, విరహ విషయ విభ్రమమైన శుద్ధ మధ్యమ స్థాయిలో భ్రమరగీతలు పాడాడు.

సుగంధి : అవును. అతడు చక్కని సరళిలో స్వాదువుగా చదువుతాడు. శేషం చెప్తావా?

వకుళ : చేతనైనంత చెప్తాను విను. ఉపాంత వనాంతరములో ఉత్ఫుల్ల పుష్పాసవం చేస్తున్న ఎలతుమ్మెదలన్నీ ఎదమెత్తిన కొదమ గువ్వలవలె - జంటలు జంటలుగా, గుంపులు గుంపులుగా లేచివచ్చి పైపైన బంతులు బంతులుగా పరిభ్రమింపసాగినవి. 'సాధు! సాధు!' అన్నది శుచీదేవి. మావదినె కన్నులలో సన్నవెన్నెల కురిసింది. నా మనోమయ ప్రతిపత్తి యావత్తూ ఆతని వైఖరీవాగురులలో, ఉపనిషత్సూత్రాలలో ప్రణవ(హ)వృత్తివలె తగుల్కొని ఉరిపడ్డది.

సుగంధి : ఎంత చక్కగా ఉన్నదే నీవక్కాణము. చిగురాకులమీద చిన్ని తేనెలు చెమర్చినట్లున్నది...

వకుళ : నీమెప్పుల కేమిలే. అసలు నా (ఆగి) మా సంగతి అంతా ఆలకించు. నాడు మొదలు, కాదు ఆ క్షణము మొదలు అనుకూల వర్షాభిషిక్తమైన పచ్చపైరులాగా మా సుహృచ్ఛాతము పాదుకొని, పెరిగి, పసిమెక్కి, పల్లవించి (విలంబితంగా) పూ-త-కు-ఆ పూతకు వచ్చిందిలే!

సుగంధి : ప్రియమతీ! పిండెకు వచ్చేసరికి, ఎందుకో మందగించింది మాట...

వకుళ : ఏమీలేదు (మంద మందంగా) అంతవఱకూ మాసావాస సహకారం ఎంత స్వచ్ఛంగా ఉన్నదో అంత అచ్ఛంగా కొనలు సాగింది; తేటలు తేరింది; ఆశలంటి ఆడింది. స్వజనమంతా అశంకా లవలేశంగా ఉల్లాసపడేవారు. అన్య జనంకూడా అనవగీత పరిచయంగా ఆనందించేవారు. అయితే, అ–యి–తే–

సుగంధి : అయితే! ఏమయింది ఆమీద...

వకుళ : సుగంధీ! మాపులు రాగిల్లినవి. దానితో మధు గంధ మత్త తిక్తమయింది. చరాచర జీవచాలన తోడ్తో సుందరుని విలోకనములలో ఏదో వింత దాపరికం గోచ రించింది. మాటలలోకూడా ఒకానొక మరుగు దాగుడుమూత లాడసాగింది. అంతటితో అవ్యక్తమూ, అగమ్యమానమూ అయిన మనోవ్యసనమేదో ఉభయులకూ అంకురించింది. కాని, ఈ మూగముచ్చట ఎంతో కాలము నడవలేదు. చీకటి తాకని రాత్రి మూడుదినాలున్నదనగా, ఊరంతా బాల భాగవతం చూడడానికి పోతుంటే మావారుకూడా రేపల్లెకు వెళ్ళారు. మావదినె ఇంకా నూతిలో చేదవేయనందువల్ల నన్ను ఆమెతో ఉండమన్నారు.

సుగంధి : సుందరుడుకూడా వెళ్ళాడా రేపల్లెకు.

వకుళ : వెళ్ళాడో, లేదో చూతామని వాళ్ళ ఇంటికి వెళ్ళాను. ఇంటిలోనే ఉన్నాడు. జీవద్వాల్లభ్యం వెదచల్లు తున్న ఒక చిత్రమును పరిశీలిస్తున్నాడు. నేనుపోయి ప్రక్కనే

తిన్నగా కూర్చున్నాను. నా చూపులుకూడా ఆ చిత్తరువు మీదనే హత్తుకొన్నవి.

సుగంధి : నిజమే. చిత్రావస్థానంలో సంకేతమూ, సందేహమూ జాఱిపోతుందంటారు.

వకుళ : వినవేం. ఆ చిత్రవిషయం. శిశువుకు పాలిస్తున్నది ఒక కులాంగన. ఆమె వెనుక నిలబడి ఉన్నాడు ఉత్కంఠతో యువకు డొకడు.

సుగంధి : ఇంతేనా, ఇంకేమయినా కలదా ఆపటము మీద.

వకుళ : ఇతర విశేషమేమీ కనిపించలేదు. కాని, సుందరుడు పటము నాచేతికిచ్చి 'వకుళా? దీనికేమి పేరు పెట్టవచ్చునూ' అన్నాడు. 'స్తన్యప్రదానం' బాగుంటుంది, అని అనవధానంగా అనివేసాను.

సుగంధి : ఏమి పేరుపెట్టావే! కన్నె మొగంమీద కస్తూరి తిలకంలాగా అతికింది.

వకుళ : అతడు అంతట (అధరస్పందన మభినయించి ఆలసించును.)

సుగంధి : వెనకాడకు. కదలిన సానలో ధార తెగరాదు; తెగదుకూడా.

వకుళ : (స్తబ్ధకంఠముతో తలవంచి) తటాలున నాచేలాంచలం లాగి 'ఆమె స్తన్యప్రదానం చేస్తుంటే, నీవు నాకు స్నేహదానం చేయరాదా' అని, ఇంకా-ఇంకా, ఏమో-ఏమో అన్నాడు. నేనుకూడా, భయంలో, భ్రాంతిలో ఏదో-ఏదో

మళ్ళీ అన్నాను. వాద ప్రతివాదాలలో, సవ్యాపసవ్య చేష్టితాలలో, పురస్కార తిరస్కారాలలో, హద్దు ప్రొద్దులు గణించకుండా కొంతసేపు పెనగులాడుతూ సదమదమైనాము. చివరకు భిన్నకంఠంతో స్నేహాభిషేకం చేయవా? కర్పూరదీపం ఆర్పివేస్తావా అంటూ...(నోరు మూసికొనును)

(తెరలో)

తుమ్మెద త్రాగని తమ్మి పూవులో
మెఱిసే తేనెల మేలేమో?

కోకిల కందని కొదమ పల్లవము
ముదిరి ముదిసి పడిపోవుటెగా...

సుగంధి: అది సుందరుని కంఠమే. వాడినా వాసనపోని వకుళమాలలాగా ఆమోదమేదురంగానే ప్రసరిస్తున్నది.

వకుళ: (వివర్ణయగుచు) పోదాంరా! చెలీ! పోదాంరా! అతడిని నేనిక చూడలేను. చూచి సుప్తసుప్తంగా, సహ్యాసహ్యంగా మ్లానమౌతున్న మానాభిజ్ఞానం మేలుకొంటే భరించలేను. పోదాం-రా!

(ఇరువురూ నిష్క్రమింతురు)

పరంజ్యోతి: గొల్లపల్లెలో-ఈ ఇల్లాండ్లకల్లోలానికి ఇంచుకించుక మూలకారణం కనబడుతున్నది. కుశీలవులు కామాని కితవులుతున్నట్లున్నది. దీనిని అరికట్టాలె. లేకపోతే సమాజం సంకరమవుతుంది. ముఖ్యంగా సుందరాన్ని సుపథానికి త్రిప్పాలె. వకుళలో సతీత్వమెంత పరాసీమలు దాటింది!

పాపం! స్త్రీజనము ఉదాసీన హతమౌతున్నది. మిత్రులపట్ల అనభిద్రోహం స్త్రీలకు విలక్షణ లక్షణమని మా మాతృ దేవత చెల్లికి చెప్పుతుంటే విన్నాను. అది ఇప్పుడు స్మృతికి వస్తున్నది. మిత్రుని ఇష్టార్థచ్ఛేదనం వకుళకు అభిద్రోహంగా తగిలింది. అది చేయలేకపోయింది. తాను గోతిలో కూలింది.

(సాలోచనంగా శూన్యదృష్టితో నిలబడును)

(తెర వ్రాలును)

## నాల్గవ రంగము

సుందరుడు, పరంజ్యోతి ప్రవేశము. చెరియొక ప్రక్కనుంచి

సుందర : తుమ్మెద త్రావని తమ్మిపూవులో
మెరిసే తేనెల మేలేమో

కోకిల కందని కొందమపల్లవము
ముదిరి ముదిసి పడిపోవుటెగా

పరంజ్యోతి : సుందరం! ఈపాట ద్విపదిగానే నిలిచిపోయిన ట్లున్నది. కృత్యాద్యవస్థ దాటిపోయినా కుంటింది కంఠం. ఏదో, అంతర్నిరోధమో, తెలియరానీ, తెలుపరానీ శిర్యగా శయమో తగిలిఉండాలె. అసలు ఈగేయం ఎప్పుడువ్రాసావో జ్ఞాపకమున్నదా ?

సుందరం : నిజం చెప్పేదా ! దీనిని మొట్టమొదట అవశ్య ప్రియాభిప్రేతంగా ఆరంభించాను. ఇష్టార్థమంతా ద్విపద బంధంలోనే ఇమిడిపోయింది. అయితే, వాడినా వదలని వకుళ గంధంలాగా నాపదంకూడా జీవనం శుష్కించినా తేమ చావని చెలమవలె ఉన్నది.

పరం : చాలులే. త్రిపద కావలెనంటే గాయత్రిని ఆశ్ర యించవలసి వస్తుంది. ఏమయినా నీపీ వకుళాపచారదోహ దానికి ఉపక్రమింపకపోతే మాకీ చెరుకుపాలు దొరికేవి కావు. రెండు గరిటెలైనా చవి చిక్కని పదమిథునం చిక్కింది.

సుందరం : సఖుడా! వకుళా ముకుళ ప్రసంగమెత్తితే నాకు ఆపరాని తాపం కలుగుతుంది. అది విరహజన సహజమైన కాయజానలదాహమో, లేక దుర్విచేష్టాదష్టమైన భావజాతపదోషమో నిశ్చయింప రాకున్నది.

పరం : సుందరం! అయితే, ఈ చిత్తచ్ఛిద్రావస్థకంతా సాంగత్యచ్ఛేదనమే కారణమా? ఊ...ఇప్పుడు సమన్వయం కుదురుతున్నది నా ఊహకూ, వకుళ గీతకూ (తనలో) సుభాషి ప్రమాదంలో జారినా పడిపోకుండా ప్రజ్ఞానంతో తేరుకొన్నాడు. ఇతడు పూర్తిగా మునిగాడు. ఇలా వదిలివేస్తే తేలడు. గాలంవేసి మీదికిలాగాలె. (ప్రకాశంగా) మిత్రుడా! నా ప్రతిపాదన స్మృతికి తెచ్చుకో. స్నేహమే, స్నేహ మొక్కటే సుమా-సుఖప్రకాశనమును పోషిస్తుంది. అదే-ఆ స్నేహమే-అతిసేచనంలో దీప మార్పి, దుర్గామ దుఃఖకారమవుతుంది. అందువల్లనే స్నేహానుష్ఠానంలో అవధానం అవ్యక్తంగా ఉంటుంది. సర్వదా, సర్వత్రా వ్యభిచార ప్రసక్తిపట్ల అప్రమాదం వహిస్తుంది. సాంగత్యప్రతిపత్తిలో మెలకువకంటె మాంద్యమునకు అవకాశ మెక్కువ. మిథునభోగంలో సుఖానుభూతి ఉన్నదంటావు నీవు. అవును, ఉన్నది. కాని, ఆ సుఖము కాయికకైంకర్యమాత్రంగానే అలసి అంతరిస్తుంది. అంతేకాదు, సఖ్యసంధానం ముఖ్యముగా అంతఃకరణ నిష్ఠం. అందువల్ల అది వ్యంజనావృత్తిలాగా, విపులాతి విపులంగా విస్తరించే అవకాశమున్నది. ఋజూపచారకమైన చేతస్సంజాతమంతా భావానురంజితమైతేనేగాని పరిపక్వము కాదు. కేవల తనూపరాగప్రసక్తికి ఆ ప్రభావము లేదు.

బహిరింద్రియ భాక్తమైన సాంగత్యం విరళవిరళమై విపర్య సిస్తుంది.

సుందరం: సఖుడా! నీ అమల ప్రతిపాదనం అపర్యుషిత ప్రసాదంవలె ఆకర్షిస్తున్నది నన్ను. సమగ్రంగా వివరించు, వింటున్నాను.

పరం: మిత్రుడా! కళామిశ్రుడవు. నీవు వినాలనే నా సంకల్పం. అందుకోసమే భాషిస్తాను. మాధురీమీమాంసకుల మతమును మనము పలుమాఱు ప్రవచనం చేసాము. క్రియా వలిప్తముకాని భావోపాధిలోమాత్రమే రసాదిరూపమగు అనంతార్థమందుతుందని వారి సంప్రదాయము. రసాభినీతమగు సంవిదున్మీలము నే మనము బ్రహ్మానందముగా భావిస్తున్నాము.

సుందరం: అయితే, గృహస్థులగతి యేమి? వారి దాంపత్య నిరతిలో అంగాంగసంయోగం విశిష్టధర్మం గదా?

పరం: ఆ! కొంచెము సమీక్షించి చూడు. దంపతీధర్మం అపత్యసిద్ధితో శుద్ధపరిణామమును పొందుతుంది. అనంతర వైఖానసప్రవృత్తిలో నివృత్తిప్రాయమైన అకామ్య విప్రలంభ ముఖంగా జీవితం విపాకము నందుచున్నది. మిథునాలంబనము శిథిలంకాకుండానే అనుసంధానమంతా భావానుభూతిగా పరిణమించే పరమావస్థయే ఆనందం. అమలినమైన స్త్రీ పుంసయోగంలో ఈ చిత్తసంస్కారం ఆలీఢంగా ఉన్నది.

సుందరం: మిత్రుడా! చలత్తులాప్రాయంగా ఉన్నది నా చిత్తావస్థ. నీవో అచుంబితమైన నరనారీయోగమును దురవగాహంగా అవలోకిస్తున్నావు. కానిమ్ము; నావాక్కు మొక్క

పోయింది; చిత్తము చిట్లింది. కానిమ్ము; నీవే కానిమ్ము. అవహితుడనై ఉన్నాను. నడిసముద్రములోనున్న నన్ను వదలకు. ప్రక్కన ఏదో కనిపట్టుతున్నది. అది పామో, పాశమో తెలియడంలేదు. త్యజింపకు; నన్ను త్యజింపకు !

పరం: సుందరం నీకోరిక దాటరానిది. అవశ్యం ఆదరణీయము. వింటున్నావా! నారీనరప్రవృత్తి - ప్రతిపత్తి అందామా, ఎంత నిర్మల నిరపాయమైనదో అంత నిష్ఠుర అపాయమైనదికూడా అగును. కాని, గృహాభ్యంతరంలో నిరంతమూ జరిగే కామేష్టిని మనము యథా సావధానంగా గమనించడంలేదు. మానవులకు అంతఃకరణమనే ఒక గోప్య కోశ మున్నది. అది స్నేహ ధారాధౌతమైతే విచ్చి విప్పారుతుంది. ఆ మహనీయావస్థే సుమానుషత్వం.

సుందరం: అవునోయి. అద్దంలో చూపినట్లు ఉంది నీ వ్యాఖ్యానం. నీ నిరూపణంకూడా విశిష్టంగా విస్తరించింది. కాని, క్లిష్టంగా లేకపోలేదు. ఎల్లాగూ జీవితం స్త్రీ పురుష సంయుక్తంగానే పరిపాకము పొందుతుందీ; అది దంపతులలో సంతానసిద్ధితో తనువిశుద్ధమై చరమ వైఖానసచారణలో ఆనందమును అందిస్తుంది. కాగా, దంపతీనియతముకాని మిథునసాంగత్యంలో జీవితము అబద్ధమై, అనర్థగ్రస్త మవుతుందని పర్యవసానం. కాదూ? అంతేనా? నేను సరిగా అర్థం చేసుకొన్నానా ?

పరం: నాభాష్యానికి నీసూత్రం చక్కగా కుదిరింది. అంతే...

సుందరం : (సాలోచనుడై) మంచిది. ఈ నిరూపణకు పూర్వోత్తరములుకూడా సమాలోకనం చేసి ఉంటావు. వాటినికూడా వివరిస్తావా ?

పరం : ఆ, అల్లాగే, విను : దాంపత్యగ్రహణంలో అవ్యక్తంగా ఒక మహాక్రతువు జరుగుతున్నది. పురుషుడు . శిష్టాకైంకర్యమైన బ్రహ్మచర్యను పరిత్యాగం చేస్తున్నాడు. స్త్రీకూడా పితృగోత్రంతోపాటు తన అక్షయ కన్యా సౌభాగ్యమును విసర్జిస్తున్నది. ఉభయత్యాగ భాగధేయమే దాంపత్యం. అది అపత్యరూపాదికంగా స్వాత్మావలోకనకు సాధక మౌతున్నది. అనాదియైన శ్రుతికూడా ఇలాగే వినబడుతున్నది. ఈ మహార్థమునే సుభాషి తన గేయంలో సుగమంగా సురభిళింప చేసాడు.

సుందరం: పరంజ్యోతీ ! ఆ గేయం నేను వినలేదు. పాడితే వింటాను. కంఠస్థంగా లేదా ?

పరం : లేకేమి ! (అని, పాడును)

కోయరాదురా ! ఈ
కువలయ కోమల కుసుమకోశమును
కోయరాదురా !

త్రెంపబోకురా ! ఈ
తీయనిజంటల భావబంధమును
త్రెంపబోకురా !

చెఱపనేలరా ! ఈ
సృష్టి సుముఖ శుభసుందర తిలకము
చెఱపనేలరా !

సుందరం : వా! ఏమి రచనోయ్! చిక్కతీసి, పాయలు చీల్చి, దువ్వి, సన్న కచ్చులు తీర్చి, చక్కదనాలల్లిన కన్నె జడ లాగా నుడికారాలు దండకట్టినట్లున్నదిరా. పెన్నేరులకు రాచిన కేతకీస్నేహ పరిమళంవలె ఏదో భావం గుబాళిస్తున్నది. (అంటూ, దీర్ఘ భావనలో వివశుడగును. కొంతతాళి, కన్నులు వింత తేజస్సు వర్షిస్తుండగా విప్పి) సాధు! సాధు!! సుభాషి పంక్తులు నిజంగా దివ్యసుభాషితము లవుతున్నవి. కాని, జ్యోతీ! మన మనన మథనలు ఇంకా సాకాంక్షితాలుగా అందీ అందకుండానే ఉన్నవి.

పరం : ఉద్వాహ ప్రయోజనం తీరగానే దంపతీసాంగత్యం స్నేహ సాహచర్యంగా మాఱుతుంది; మాఱవలె. నట్టిల్లువిడిచి చిట్టడవిబట్టిన మిథున సాహచర్యం సుమానుష జీవత్కళ్యాణమును లక్షించి వినియుక్త మాతుంది.

సుందరం : అది యెల్లాగోయ్? లత్తుక కడిగిన మాత్రాన రంగుల గిన్నెలు సోమరస పాత్రలుగా మాఱగలవా?

పరం : సుందరం! కొంచెము అభిముఖుడవై విను : సహజమూ, సక్రమమూ, సంపూర్ణమూ అయిన రాజ యోగంలో ఈ చిన్మయ వికాస మున్నది. వైఖానసులంటే –

పండి వంగిన కల్పపాదపంబుల క్రింద
గాలితో ప్రాణాలు నిలిపేరు
పసిడి తామరపూల పసుపారు తీర్థాల
సతతంబు స్నానాలు సలిపేరు
అచ్చరల కట్టెదుట అమరమణి వేదికల
నిశ్చల ధ్యానంబు నిలిపేరు

సుందరం : ఇది జీవప్రకృతికి విరుద్ధము. సహజ సంగతం కాదు.

పరం : ఎందుకో, తేలికగా మాట్లాడుతున్నావు. నీవు విద్యాధరుడవని మఱచిపోకు. నూనెత్రావిన వత్తిమీద ఘృతంపోసినా గ్రహింపదు. స్తన్యపానంవిడిచిన శిశువు తిరిగీ మాతృవక్షంకోసము పరుగెత్తుటలేదు. వదలిన కుబుసానికై భోగికులం ఆరాటపడుతున్నదా? నిజమేమంటే, భుక్త రుచులతో పరితృప్త తుష్టులయిన ప్రాజ్ఞులను ప్రాతతీపులు తిరిగీ లాగలేవు. పునరాస్వాదనం ఒకపక్షంలో ఉచ్ఛిష్టభోగమే కదా! అంతేకాదు. కాండనుంచి కవటాకు మొలిచిన తరువాత దాని తరుణ సౌభాగ్యమంతా మొలకమీదనే ముఖీకృతమౌతుంది. ఇంకా...శుచిమంతమైన మిథునాంతర్మథనంలో చిత్సుఖోదయం అవుతుంది. అది అమలినమైన స్మృతిలో అనుజ్జ్వలదీపనంగా భాసిస్తుంది. ఆ భావమును నిలుపుకొనేవారు ఏతత్పునరావృత్తిని వర్యుపీతంగా పరిత్యజిస్తారు. కాగా, జీవితఖేలనం తనూత్సంగమును విడిచి భావాంబరములో విస్తరిస్తుంది. ఈ వినయ విషయ విరహదశలో, గార్హస్థ్య చరితార్థుడైన పురుషుడు సమస్త సతీకులమందును మాతృ మహాత్కలను ఉపలక్షింప కలుగుతున్నాడు. అల్లాగే, స్తనంధయాసంగ తన్మయురాలైన స్త్రీయును యావన్నరజాతమును వాత్సల్యకృత్స్నంగా ప్రేమింప కలుగుతున్నది.

సుందరం : (ప్రబుద్ధముఖంతో) జ్యోతీ! ఈ మహత్తర దర్శనం నీకు ఏదశలో భాసించిందో తెలియదు. నీవు సుకృ

తివి. కటికచీకటింటిలో కళాపూర్ణోదయమైనది. ఆ సుము హూర్తం—ఆ సన్నివేశం వినాలని వేడుకపడుతున్నాను.

పరం : ఒకానొకప్పుడు బిడ్డకు పాలిస్తున్న ప్రసూతా చిత్రమును లిఖించాలెనని సంకల్పించాను. ఏతత్ రూపోపాస నలో వసంతగ్రీష్మములు రెండూ గడిచిపోయినవి. బింబావ బోధం కాలేదు. తుదకు రూపరేకల పొలకువలైనా పొడకట్టి నవికావు. శ్రావణం వచ్చింది. ప్రశవశాలకు పోతున్న కాదంబినీ కఠోరగమనంలో యత్నించిదుపమేయంగా ఏదో కొంత ద్యోతమయింది.

సుందరం : బాగున్నది. కృష్ణావతరణానికీ, యమునా రజ స్వల తరుణానికీ చైతన్యసంబంధ మున్నదంటాడు సుభాషి. అతనివాదం ఇప్పుడించుక అభిగమ్యమాన మవుతున్నది. తరువాత—

పరం : వెంటనే రేఖావిలేఖనము ప్రారంభించాను. కాని, అది పూర్తికాదు. ముఖ్యంగా శిశుముఖమును స్తనాగ్ర విన్యస్తంచేసే వాలకం కుదరదు. ఎలాగో అది సవరించాను. అనంతర రచన మఱీ కృచ్ఛ్రమయిపోయింది. అదంత శిశుముఖ పీడనలో పులకించి తాదాత్మ్య మీలోన్మీలనములయ్యే తల్లి చూపులను రూపించుకొనడమూ, రేఖించడమూ అతి కష్ట మయింది. అవయవములపొత్తు పొందికలలోనూ, వానికి ఒప్పి ఒదిగే రంజనానులేపనములోనూ నా పడ్డ క్లిష్ట విలోడ నానికి అంతులేదు. ఇల్లా అహోరాత్రములు నడిచినవి. సుడిగాలికి చిక్కిన చిలకరెక్కలాగా నా భావనకూడా వ్యగ్ర

వ్యసనవిధూతమై, ఒరిగి-సురిగి-వివిక్తంగా-వివశమై వ్రాలిన ట్లయింది. ఆ సౌఖ్య సుస్వప్నమై,-అందులో నా శైశవపేశల శోభనమంతా కనపడ్డది. జారీ జారని ఆ స్మృతి దీపకచ్ఛాయలో ఆ పవిత్ర చిత్రణం సాగించి ముగించాను.

సుందరం : జ్యోతీ! అసహ్యమైన ఉద్వేగమేదో నన్ను మెలిచి, నలిచి నములుతున్నది. లోలోపల సంతాపము పుటపాకమువలె ఉడుకుతున్నది. అవయవములన్నీ అంతర్దాహమువల్ల చెమరించి, క్లిన్నక్లిన్నము లవుతున్నవి. నఖశిఖా పర్యంతం ఏదో ఇష్టానిష్టవికారము ప్రాకుతున్నది. పెను బాములు పీకుతున్నట్లు-క్రూర శస్త్రికలు కోయుచున్నట్లు-శరీరమంతా దురంతవేదనతో బాధపడుతున్నది. ఎసటినీళ్ళ వలె మనసు మసలి తెర్లుతున్నది. వివేకం వెక్కిరిస్తున్నది. ఆప్తుడా! ఆగలేను, తాళలేను; పోదమురా. నీవు సృజించిన స్తన్యప్రదాన ప్రతిమకు ప్రదక్షిణంచేస్తే ఏమయినా శాంతి కలుగుతుందేమో!

పరం : (వ్యాకులము నభినయించి స్వగతంగా) ఇతని అవస్థ ఇలా ఉన్నది. ఇక వకుళగతి ఎల్లా ఉన్నదో చూతును. ఆ దంపతులు జీవచ్ఛాయలలాగా ప్రేమ చాంద్రాయణవ్రతం పట్టారని విన్నాను.

సుందరం : మిత్రుడా! ఏమి ఆలోచించుచున్నావు. పోదమురా! పోదమూ!

(తెర వ్రాలును)

## ఐదవ రంగము

### వకుళ గృహము

ఇల్లంతా అద్దంలాగా పరిశుభ్రమై, చిత్రపటంలాగా సర్వాలంకార శోభితం. వకుళ అభ్యంగనముచేసి, నారంగ దుకూలంచుట్టుకొని, శిరోజములు తుడుచుకొంటూ, అకంచుకంగా దువ్వెనతో నిలువుటద్దముముందు నిలబడి పాపట తీసుకొంటూ ఉంటుంది.

వకుళ : (పలుమాఱు దువ్వుట నభియించుచు) ఏమిచేయాలె! ఈ పాపట వంకలేకుండా నిలబడడం లేదు. సీతమ్మ పుట్టింటి చాలులాగా సీమంతము చక్కగా ఉండాలె నంటారు. సూటిగా చేయాలెనని సుగంధి పలుమార్లు దువ్వి దువ్వి వేసారింది; చక్కబడలేదు. పిన్ని ఎన్నితడవలో తడివి తడివి, దువ్వెనలు మార్చి, పరిష్కరించింది; వంకర పోలేదు. చిన్నప్పుడు ఎప్పుడో యాదాలాపంగా 'పాపట వంకరయితే బ్రతుకంతా వంక రేన'న్నది ఆ సాధ్వి. ఆ మాట నాకు మాటి మాటికీ జ్ఞాపకం వస్తుంది. ఏదో వేడిసూదితో పొడిచినట్లు బాధపడతాను. శీలానికీ సీమంతానికీ, బ్రతుకుకూ పాపటకూ ఏమి సంబంధమో బోధపడదు. విరూపవతులనూ, పేద పేరంటాండ్రనూ, పరీక్షతో చూస్తాను. కన్యలనూ కాంతలనూ, వంధ్యలనూ వృద్ధురాండ్రనూ, జానపదులనూ నాగరకులనూ శ్రద్ధతో పరికిస్తాను; వారి పాపటలను పరిశీలిస్తాను. అంతటా, ధ్రువరేఖలాగా వడివంకలు లేకుండా, ఋజు రమణీయంగా కానబడతవి. నాకర్మమేమి కాలిపోయిందీ? తమల పాకులో తల్లియీనెలాగా నా పాపట ఎందుకు చక్కగా

నిలబడదు ? మానసపయస్సులు మలినములై పోయినవా ? హృదయంకోశం ఒప్పూ, విప్పూ లేని తిలపిష్టపిండికలాగా ఎండినదా ? ఏమయిందీ ? నాకూ నా జీవితానికీ, నా నడవడికీ, పోనీ, వంక ఉంటే, ఇంత శరీరమున్న దే? అదియేల నా నడినెత్తిన అలంకారస్థానమందే చేరవలెను ? ఏమో-అవశమవుతున్నవి సర్వాంగములును! (దువ్వెన అవతల పారవేసి) ఇక తల దువ్వుకోను. మఱచిపోయినాను-అభ్యంగనమాడిన సుమంగలి ధూపావర్జనం చేసికోకుండా కుంతలములు ముడువరాదు!
(ధూపపాత్రలో కర్పూరకణికతో అంటించి, మంచము వాల్చుకొని, శిరోజములు జాఱవిడిచి శయనించును, నిదురపట్టును.

పరంజ్యోతి (పాటపాడుతూ ప్రవేశము)

గేయం [స్వగతం]

పేరీ పేరని క్షీరభాండమును
కదిపి కలుపుదురె సఖుడా !
త్రావిన తుమ్మెద తనియకపోతే
ఇచ్చే పువ్వున కేముద్దో !
వన్నెలువాడీ చిన్నెలు చెదిరీ
నవకముమాసే నరనారీగతి
శోభనమంటే నమ్మేరా !
సురసుఖమంటే నమ్మేరా !

ఈ గేయమును ఒకసారి వకుళ పాడుతుంటే విన్నాను. చెవులు అప్పగించి, చేష్టలు లేక, చిత్రంవలె వింటున్నది సుగంధి. ఆమె యేదో ప్రశ్నిస్తుంటే వకుళ యేమో చెప్పుతున్నది. 'ముడి ముచ్చటగా ఉన్నా, విడితేనేగాని ముంగురుల

సిరి పైకి కానరాదు' అంటూ ఉండగా నేను వెళ్లాను. వాన జల్లుకు వాక్కులు మూసిన కోకిలలవలె స్తంభించి నిలబడ్డారు వారిద్దరూ; నేను పశ్చాత్తాపపడ్డాను. కాని, జరుగవలసిన భంగం జరిగిందికదా అని ఎంతో కటకటలో తపించాను. అప్పుడు వారితో ఏమేమో, ఆకున అంటకుండా పోకన పొంద కుండా, సాకులాడి నిష్క్రమించాను. నాడు మొదలు నేటి దాకా ఈ గేయం స్మృతిలో మెదిలినా, శ్రవణపాతమైనా బహుముఖంగా భాసిస్తుంది. (అటు నిటు పరికించి) ఏమిదీ! వాకిండ్లన్నీ తెరిచి ఉన్నవి; ఎవ్వరూ కానరారు. ఇల్లంతా ధూపసుగంధం సుడివేస్తున్నది. నేడు శుక్రవారంకూడా. వకుళ యెక్కడికీ పోదే. ఆబిడకు గంపంత పూజాదికం ఉంటుంది ఈదినం. (గదులు నాలుగుప్రక్కలా పాఱచూచి, నాలుగడుగులు వేసి వసారావైపు దృష్టిసారించును. అకంచుకగా, సస్తోత్తరీయంగా నిద్రాపార వశ్యంలోవున్న వకుళా ముకుళమూర్తి దర్శనమవుతుంది)

పరం : (చకితుడై వెనుకడుగువేసి) హా! హతోఽస్మి. అహో! అనుచితం! అక్రమం! అనిచ్ఛాపాతకం! (అంటూ పైనా, క్రిందా పక్కలా, కలియచూచును) ఏదో తపన, ఏదో తాపం, ఘాతుకుని వలె నన్ను తన్నుచున్నది. ఒడలంతా కందగడ్డవలె కమిలి ఉడికిపోతున్నది. ఉద్వేజనం ఉప్పొంగుతున్నది. అవయవ ములన్నీ, ఎసటి నీళ్లవలె, మసలిపోతున్నవి. పంచప్రాణ ములు సుడిగాలిలో చిక్కిన ఎండుటాకులవలె ఎగిరి ఎక్క డికో పోతున్నవి. ఇంద్రియవ్యాపారంకూడా పెడవోయి జడీ భవిస్తున్నది. ఒక్కనిమిషములో ఇంత విపరీతపరిణామము సంగతమౌనా? (ఇంచుక ఆగి) అవిగో, తుహినధారలు; జడి గొని పైన కురుస్తున్నవి. శీత శీతలమయిన శ్రీచందనం పూస్తు

న్నారు ఎవరో! ఎందుకో! నిముసంక్రింద నిలుపజాలని నిట్టు
డుకు ఉత్తరక్షణంలో కట్టూటగా మారింది. దవానల దగ్ధ
మవుతున్న శిరస్సునకు శిశిరస్నేహాంజనం పూసినట్లు, కాలు
చున్న కన్నులలో కర్పూరం గుప్పినట్లు చల్లపడుతున్నది
సర్వమూ. కుండకు కుమ్మరించినట్లు చూపులన్నీ ఒక్కసారిగా
బయటపడి పోతున్నవి. అదిగో! ఏదో హిరణ్మయకాసారంలో
దూకి ఏకమవుతున్నవి. ఏమి ఈచిత్రం! అవి మళ్లీ తామర
తూండ్లవలె, విద్యుద్దీచికలవలె వెనుతిరిగి నా నేత్రకవాటము
లను పగిల్చి ప్రవేశించుచున్నవి. నేను సమాధిలో ఉన్నానా?
మూర్ఛలో మునిగితినా? మోహకూపంలో కూలితినా?
-ఏమయినాను? మూఢుడనైతిని; కాని, తెలివి తప్పలేదే?
ఔచితి నతిక్రమించాను. అయితే, అది ఉద్దిష్టముకాదే.
(నిట్టూర్పు పుచ్చి) అబ్బా! క్షణక్షణం ఛిన్నంగా, ఉత్తలమై.
ఉద్విగ్నమై, నా చేతము జాగ్రన్నిద్రా సంధిలో, చేష్టా
ఽచేష్టాఽక్లృప్తిత మవుతున్నది. (కన్నులు మూయుట నభినయించి)
అహో! ఎక్కడి దీ మహాదృశ్యం? చీకటి వెలుగుల నడికట్టిన
చక్రవాళం క్రుంగిపోతున్నది. చాతకం తొలకరిచినుకులు
త్రాగగా, చక్రవాకం వెన్న తింటున్నది. నవ్వుచున్న నగ
శేఖరంవలె భూరిపక్షభాసంతంగా మహామేరువు లేచు
చున్నది. ఈ విస్మయ విన్యాసంలో హస్తములుచాచి లోకా
నికి హిరణ్మయదానంచేస్తున్న నటరాజతాండవము వ్యంజిత
మవుతున్నది. ఔను. (స్మృతి నభినయించి) ఊహూ! స్ఖలితమైన
స్మృతి - పట్టుకొమ్మ దొరకని పసిచిలకలాగా-దిగ్భ్రమిస్తు
న్నది. (వివశత్వము నభినయించి) ఏదో అంతస్స్ఫురితం అవ్యక్తంగా

అనుగ్రహంగా అలమికొంటున్నది. దృష్టికూడా దూరాంతికవిర హితంగా ప్రసరిస్తున్నది. ఈ హేమకూట పక్షములనడుమ-నట్టనడుమ-సహస్రద్యుతి సంకులమైన లోయ-తుదీ, మొదలూ లేని లోయ-సోముడు తన ఘటమునిండా అమృతం నింపుకొంటున్నాడు. ఏడుగుఱ్ఱాలు మోయగలిగినంత సువర్ణద్రవ్యమును సూర్యుడు తన రథమున కెత్తుచున్నాడు. ఉద్ధూతములై పైకెగిరిన కాంతిరేణువులు పేరుకొని తారకలవలె మెఱుస్తున్నవి. (స్తంభపడి నిలిచి) ఇరుప్రక్కలా పచ్చచేమంతులు అడవులవలె సందులేకుండా పూచినవి. రత్నరాసులు కరగి, కలసి, సెలలై, సోనలై, సన్నసన్నగా - స్తన్యధారలవలె-పార్లుతున్నవి. క్రిక్కిరిసిన కొండగోగులచాళ్లు వెఱ్ఱిగా విరిసిన తలపూలతో త్రుళ్ళి తూగుతున్నవి. (కన్నులెత్తి చూచి) ఆహా! ఈ పసిమి-ఈ మిసిమి-సర్వమంగళాదేవి పసుపు భాండారమేమో! అంతా హిరణ్మయభూయం. కాని, స్థిమితము లేదే! రవ్వంత విశ్రాంతి కానరాదే...(ఆలోచించి) ఔను. విద్యుచ్చైతన్యమంతా ఏదో బ్రహ్మాండప్రసూతిలో సదమదమవుతున్నది. దీని పరిణామం ఏమగునో పాలుపోవడం లేదు. (ఉత్కంప నభినయించి) అబ్బా! నా అంగములన్నీ శబ్దఘటితములుకాని వర్ణములవలె నిరర్థకములైనవి. (దీర్ఘనిశ్వాసంతో) ఓహో! వక్షస్తరళ తారకావళులతోకూడా ఆకాశము మహామోహంలో అంతర్హిత మవుతున్నది. మహా జవజటిలమైన జగత్ప్రాణ ప్రసారం - విలంబితాలాపనమువలె-మందసుందర మవుతున్నది. జ్వాలాభీలమైన అగ్నిమండలముసైతం-తన వేడి వివిధపదార్థ నిక్షిప్తంకాగా-మిత్రమండలంగా పుంజీ

భవించింది కాబోలు! ఇది, భూతముల ద్రవ్యస్వరూపం. అంతా, విశ్వమంతా, ఈ కాంతావర్తంలో రసీభవించినట్లున్నది. ఇదే రామణీయక ప్రసవావస్థయగునా ?

వకుళ : నాపాపట...నాపాపట వంకతీరదా ? తీరదా ? (అని కలవరించుచు మేల్కొనును) ఆహా! నిద్రపట్టింది. ఏమి నాపాపం! స్వప్నంలో సైతం నావంకరే నాకు కనబడుతున్నది. (అని మంచము మీదినుంచి లేచి వసారాలోనుంచి లోపలికి వచ్చును) ఆహా! ఎంత ప్రమాదం జరిగింది! నేడు శుక్రవారం. (అంటూ పరంజ్యోతిని చూచును. పరిధానమును కంపంతో సవరించుకొంటూ) జ్యోతీ! నీవెంత సేపయిందివచ్చి? (భయకంపాదులతో వెనుకడుగు ముందడుగు వేస్తూ కళవళపాటు నందును.)

పరం : దేవీ! వకుళా! నీవు వకుళవుకావు. సర్వ మంగళవు; మహామాతవు. (అని సాష్టాంగముగా నమస్కరించి, లేచి) నేను ధన్యుడనయినాను. స్త్రీ లోకమందు అదృష్టంగా ఉన్న దివ్యస్వరూపం నేడు నాకు దర్శనమయింది. (అని ఏదో సాఫల్య తన్మయావస్థను సూచించుచు నిష్క్రమించును.)

వకుళ : (నివ్వెఱపోయి నిశ్చేష్టితురాలివలె మ్రాన్పడి కొంతసేపు ప్రతిమవలె నిలబడును. స్మృతి నభినయించుచు) హా! హతవిధీ! నాపాపం–నాపురాకృతం–ఇంతలోనే పూచి–పిందెగట్టి–కాయ బాటి–కుళ్ళిపోయెనా ? దేహమంతా ఎండు రేగుముండ్లతో బరికినట్లు మండుతున్నది. అంతఃకోశములన్నీ కుమిలి పోతున్నవి. కష్టం–అతికష్టం–అర్ధనగ్నమయిన నారూపం పరపురుషుని కంటపడ్డదే! ఏమి చేయాలె? ఈ పాపానికి పరిహారమున్నదా? ఎవరు చెప్పెదురు ? ఎవరిని–ఏమని–అడుగుదును. ఆహా ! పరం

జ్యోతి! అతడు నిజంగా పరంజ్యోతిస్స్వరూపి. ఆతని జీవితం ఔచితీదీపం. ఆతనికంటపడ్డదా నా కల్మషాకృతి! సుధా విశుద్ధ ములైన ఆతని చూపులు మలినములై ఉంటవి. (ఏదో తెలియ రాని వికారమును అభినయించుచు) తాళలేను; సహింపజాలను. నాలో నేను భ్రమిస్తున్నాను. పూచిన పద్మమున రెక్కలు రాలిపోతున్నవి. చిగురాకు పెళుసెక్కుతున్నది. కాటుక చిప్పలు సున్నపుకాయ లవుతున్నవి. ఇది ఏదో విపరీతం; కాని పని ఏదో జరిగింది. (అని ఉన్మత్తవలె రిత్తవోయి మూర్ఛ నభిన యించుచూ పేపగద్దమీద కూలబడును.)

సునందుడు (వీథివెంట వస్తూ)

ఏడుప్రొద్దులు జాటినవి. నేటికి కుందకాసారంలో ప్రత్యూష స్నానం లభించింది. అబ్బా! ఎందుకో ఈదినము చిన్నమ్మ లెవరూ ఆచాయ రాలేదు. కమలరేణుకపిశమైన ఆ కాసా రంలో స్నానమాడితే ఒక ఆప్యాయం-ఒకానొక అంత స్సాత్త్విక స్పృహ-అచ్చినట్లుంటుంది. నా మనస్సు ఇప్పుడు బ్రహ్మమానసమువలె, నారదుని వీణాశ్రుతివలె బృంహిత మవుతున్నది. రసనకేదో రుచితగిలి, రమ్యాక్షరపదం వలె పులకింప చేస్తున్నది. పాడుదునా! కాదు, కాదు! అందులో రాగోద్వేజనమున్నది. కావ్యాలాపనచేతునా! అమ్మో! అది సర్వదా వర్జనీయం. కాని, అంతరంగమెందుకో కవితా కలనలో కరిగిపోతుంది. అదిగో, వృద్ధని బుద్ధి చెంపలు వేస్తున్నది. కావ్యం సర్వత్రా నిషేధింపవలసిందే. కవులు మర్త్యులేనా? అయితే, వారేలోకంలో ఉన్నట్లు భాషిస్తారు. ఆరు ఋతువుల లోనూ ఆరుణ్య తారుణ్యములు పంచిపెట్టే పుణ్యపల్లవమట!

సుకుమారచుంబనాలకు చెమరించే సుతిమెత్తని అద్దాలట! పండువెన్నెలతో పరిఫుల్లలయ్యే పద్మాలట! ఏమిటి ఇదంతా? నవనీతం మహాకవి అని పేరుపడ్డాడు. అతడు అల్లే వలలన్నీ ఇల్లాగే ఉంటవి. అతని పద్యమును నోట పట్టకూడదని నిషేధించుకొన్నప్పటికీ దానిభావం జ్ఞప్తిలో నిలిచిపోతుంది. ఇదే కావ్యతంత్రమేమో! ఇందులో ఏదో మోహన మంత్రాభిచార మున్నది. వద్దన్నా వదలదు-అంటకున్నా అంటుకొంటుంది; వీనులు మూసికొన్నా వినబడుతుంది; కన్నులు విప్పకున్నా కనబడుతుంది. (పరిక్రమించి) ఇదిగో వకుళాభవనం. సమీపించాను. శుక్రవార ముఖశోభలన్నీ ఈ యిల్లాలివాకిట కట్టుపడినట్లున్నవి. (లోపల ప్రవేశించును)

[వకుళ సునందునిరాకకు రభసపడి, త్వరగా లోపలికిపోయి, కృత దుకూల పరిష్కారయై వచ్చును]

సునందు : మహాకవి కళత్రమునకు, నవనీత సహధర్మిణికి ...వకుళా సువాసినికి, ఆత్రేయగోత్రుడూ, బ్రహ్మచారీ సునందుడు నమస్కారము.

వకుళ : (శిథిలస్వరంతో) అందటికీనీ కుశలమా? నేడెందుకో అసాధారణంగా ఉన్నది నీ అభివాదం.

సునందు : కావచ్చు. నేను పలుమారు లోలోపల తల పోసుకొంటాను. నా భావాలను-సమాసాలను విగ్రహించినట్లు—నేనే విడదీసి విమర్శించు కొంటాను. చివరకు ఏమీ తేలక తలపట్టుకొంటాను. ఆ—

వకుళ : అంత క్లిష్టమైన సమస్య ఏలాటిదో...

సునందు : ఏమీ లేదు. నీవు నాకు అక్క-య్యావా-చెల్లి వా? సామాన్యంగా పూజ్యవాచికంగా నీకు వందనం చేస్తుంటాను. కాని, మనసు కుదరదు. పూజ్యభావంకంటే సంనివాత ప్రియమైన రక్తస్పృహ ఒకటి కదులుతుంది నిన్నుచూచి నప్పుడల్లా. మాతృపక్షభావనకంటే సహోదర స్నిగ్ధమయిన చనువు చిత్తమును చల్లగా ఒత్తుతుంది. అందువల్ల, అరమర లేకుండా నీతో కలసి ముచ్చటించాలె ననే కాంక్ష లోపల పెరిగింది. ఆపుకోలేక ఇటీవల కులపతి నడిగాను—

వకుళ : (తొందరగా) ఏమని అడిగావు? (లోపల గుండెకొట్టు కొంటున్నట్లు ముఖసూచన అభినయించుతూ వక్షమున చేయి చేర్చును.)

సునంద : గురుపుత్రిభామతికూడా ఉన్నదిలే అప్పుడు...

వకుళ : (ఆతురముతో) ఏమని అడిగావు కులపతిని? అది ముందు చెప్పరాదా?

సునందు : ఆ...ఏమీ లేదు. 'మేము బ్రహ్మచారులము గదా. విద్యార్థిదశలో దగ్గరి-దర్శించి-సంభాషింపదగిన స్త్రీ జనమెట్టిదీ?'...అని అడిగాను.

వకుళ : (త్వర నభినయించి) అందుకు గురుదేవు లేమన్నారు?

సునంద : ఇంతలో భామతి సందుకొని నవ్వుతూ, 'నాతో సంభాషిస్తున్నావుగా' అన్నది. నేనూ ఊరుకోలేదు. 'నీవు గురుకులకుమారదేవతవుగా' అన్నాను వెంటనే—తడువు కోకుండా.

వకుళ : ఆపైన?

సునందు : శిశిర సుఖములైన చూపులు నామీద పఱపి, అయితే, అందుకు అర్హమైన యోషిజ్జనమేదో ఆమెనే అడిగి తెలుసుకోమన్నారు వారు. అప్పుడు భామతి అనుజ్ఞకై నోట అడుగకుండా చూపులు చాచి యాచించాను.

వకుళ : ఆ విశుద్ధ చరిత యేమన్నది ?

సునందు : ఏ మన్నదా ? నీతోమాట్లాడు తున్నానుగా. వేఱే చెప్పడ మెందుకూ !

వకుళ : (తనలో) ధన్యురాలను. గురుజనము నాయోగ్య తను శంకించడంలేదని తెలిసింది. (ప్రకాశంగా) అయితే, నేడు నీరాకకు విశేషకారణ మేమైనా ఉన్నదా ?

సునందు : లేకేమి. చాలా ఉన్నది. పాఠాలలోనేకాక. భావంలోకూడా బాధిస్తున్న సందేహాలను తీర్చుకొందామని వచ్చాను. స్వేచ్ఛగా అడగవచ్చునా ?

వకుళ : నిరభ్యంతరంగా...

సునందు : ఇంట్లో మహాకవి కనిపించడేమ్...

వకుళ : ఆయన కుశీలవగోష్ఠికి వెళ్ళారు.

సునందు : ఆయన సమీక్షంలోకంటె పరోక్షంలోనే మానాలుక కించిత్ కించిత్ ఆడుతుంది; అల్పాల్పంగా ధైర్యం వస్తుంది. అయితే విను. దేవీ ! (అగ్ని) వకుళా ! (నిదా నించి) అక్కయ్యా ! అడుగదలచింది కావ్యవిషయం. తెలి సికో తలచింది చిత్రసంగతి. ప్రారంభించనా ?

వకుళ : శీఘ్రంగా-యథేచ్ఛగా...

సునందు : అయితే, కావ్యమంటే యేమిటి? అందీ అందకుండా, పొందీ పొందకుండా, వేడి జీడిపలుకులు పాకం పట్టడమేనా కవిత్వమంటే. ఈపని యిల్లా ఉన్నదంటే, ఎండీ ఎండని పలాశపత్రాలు విస్తరి కుట్టినట్లున్నది.

వకుళ : ఎల్లా ఉండాలె నంటావు మరి.

సునందు : అది అల్లా ఉంచు. మానవ సంస్కృతికి నవ్యావిష్కృతి కావలె నంటారు. అది అందరికీ ఇష్టమే; సంప్రదాయ సమ్మతమే. కాని, సమాజమును విప్లవాగ్నిలో కరిగి, ఉక్కు మూసల్లోపోసి, అచ్చుగుద్దిన ముద్దు బొమ్మలుగానో, మొద్దు విగ్రహాలుగానో తయారు చేయడమని అర్థమా?

వకుళ : అదికాదు. కాని. నీభావమూ, నీదృష్టీ బోధపడ లేదు.

సునందు : ఏమంటే, స్త్రీపురుషులే లోకంలో కనబడతారు. నిజమే. స్త్రీ జనంలో తీపీ, పురుషవర్గంలో కారం ఉన్నమాటకూడా నిజమే. కాని, పిండిఅంతా అరసెలె చేసి, నెయ్యిఅంతా కారపుగారెలకేపోస్తే యేలాగుంటుంది! తుదకది విందూకాదు; మందూకాదు. అవునా!

వకుళ : అనంతరం-

సునందు : లోకంలో పేదరికం ఉన్నది. దాన్ని పీకివేస్తామంటారు. పెద్దరోగం ఉంది. దాన్ని ఉన్మూలం చేస్తామంటారు. కావచ్చు. కుష్టుమచ్చలు పుట్టుమచ్చలుగా మారకపోయినా రోగము మానవచ్చును. కాని, నిప్పచ్చరాన్ని తప్పించుకోరాదే. అది వేకువనే తనతో నిద్రలేస్తుంది. రాత్రి

తనతోనే పడకమీద వ్రాలుతుంది. జంటలయితే ఇరువురి నడుమా ఇమిడి పడుకొంటుంది. నీడలాగా, జీడిలాగా అది వది లేది కాదే. ఎక్కడికిపోతే అక్కడికి వస్తుంది. ఆకులో ఈనె ల్లాగా తీయరాకుండా వ్రాకుతుంది. బంగారమును దొంగి లిస్తుంది. ఇనుమును త్రుప్పైతినేస్తుంది. ధనికుని హృదయంలో దౌర్భాగ్య రసంలాగా దాగుతుంది. చెప్పవచ్చిందేమంటే, లోకంలో భాగ్య దారిద్ర్యాలు-క్రొత్త ప్రాత కోకలలాగ- ఆర్జించేవీ, వర్జించేవీ కావు. అవి మానవుని మనసునకు పెనబడ్డ మెలికలు. అవునా? కవులు, సుకవులు, నవకవులు ఈ పిచ్చి ముచ్చట్లు కట్టిపెటాలె; వ్యత్యస్త వ్యాపారానికి స్వస్తి చెప్పాలె.

వకుళ: సోదరుడా! నీ విప్పుడు కవిత్వమే చెప్పుతున్నా వేమో! అయితే, నీ అభిమతమేమి?

సునందు: అక్కయ్యా! ఆపేస్తున్నావు నా ఊపును; తీపును.

వకుళ: లేదు లేదు. అది నాతలపు కాదు.

సునందు: చెల్లీ! కాదు-కాదు-అక్కయ్యా! (వకుళ నవ్వును) మానవుడెంత; అతని బయిసి ఎంతటిది! తన పరుపుచుట్టను పూర్తిగా పట్టడానికి చాలవు హ్రస్వహస్తాలు. వాటితో విశ్వంభరా వలయమును కౌగిలిస్తా నంటాడు. తుమ్మెద లేకుండా పూవులో తేనె తీయలేడు-పోయడంచేత కాకపోయినా-ఇంతటివాడు ప్రకృతిలోనున్న విద్యుద్బలమును పిసికి పిండి వేస్తానంటాడు. ఏమిటి ఇదంతా?

వకుళ : తమ్ముడా! నీవేమంటావు?

సునందు : నేను అనేదేమంటే, బాగా విను. మానవుని అంగబలం అంత అపరిమితమైనది కాదు. అల్పాల్పమైన దయినా ఆతని బుద్ధిప్రభావం అధికాధికమైనది. ఇది నమ్మాలె. దాని వికసనమూ, విలసనమూ ఉద్బుద్ధములై ఉపకరించే సంస్కారం కావాలె. దానికి తగిన అనురంజన శ్రుతిలో కావ్య గానం చేయాలె. అవునా?

వకుళ : కాదన్నదెవరు? కవుల కాంక్షకూడా అదే ననుకొంటాను.

సునందు : అదేనా? నిజంగా అదేనా? కవులూ గాయకులూ, చిత్రకులూ నర్తకులూ, వీరు కుశలంగా కదిపితేనే కాలచక్రం సమానంగా, స్వస్థగమకంగా తిరుగుతుంది. గీతలలో, పూతలలో, ఆలాపనలో, అభినయంలో వీని ప్రభావం సామాజిక సదస్సును ఆకర్షించి అలవరిస్తుంది. జీవచ్ఛాయా విష్కారం చేస్తారు వారు. ఈ అమృత దార్శనికులమీద ఒక క్రొత్త ఆకాశచ్ఛత్రం విచ్చి, విస్తరించాలె. మంగళ దేవతలు అక్షయ నక్షత్రాలతో లక్ష దీపాలు వెలిగించి తీయని త్రోవలు చూపాలె.

వకుళ : సునందా! ఏమో అనుకొన్నాను. నీ హృదయములో విశ్వకల్యాణాంశ, వాక్కులలో అనుచ్ఛిష్టామృతం, పాదుకొన్నవి.

సునందు : చెల్లీ! కాదు-అక్కయ్యా! నీకే నచ్చిందా నా ధోరణి లేక, ఉత్ప్రేక్షలోలాగా ఉత్త ఆరోపణ చేస్తున్నావా?

వకుళ: లేదు లేదు. నీ మసృణభాషణకు నా మనసు అలా అభిముఖమై అనురణించింది. సరేగాని, ఈ కవులునూ, చిత్రకులునూ-ఏ పథాన-ఏ భంగిలో-నడిస్తే నీకూ, నీ సతీర్థులకూ ఇంపితవుతుందో చెప్పగలవా?

సునందు: నేను చెప్పడానికి ఉత్కంఠించుచున్నదే నీవు అడిగావు. ఇదే సహృదయావరణమంటే. విను. వకుళా! విను. కవులు కళ్యాణ వచస్కులని ప్రతీతి. లోకకళ్యాణం ఎల్లా అంకురించి-అల్లుకొని-పూచి-ఫలిస్తుందో వారు జాగరూకులై లక్షించాలె. పాదులో పురుగున్నంతవఱకునూ తీగె తిన్నగా కొనెలు సాగదు; అసలు, బ్రతుకదు కూడా. ద్వేషం విషక్రిమి వంటిది. ముందు దీనిని త్రవ్వి, ఏటి పాఱవేయాలె.

వకుళ: బాగు! ప్రకృతిలోనుంచి మానవ ప్రకృతికి వస్తూన్నావు.

సునందు: అది సత్యం. మానవుడు ప్రకృతి గర్భసుడని మఱచిపోతే ఎల్లామఱె. మనసు మర్కటం వంటిది. మైత్రీ ద్వేషములు రెండూ దాని వ్యవసాయములె. అందువల్ల, మొదటినుంచీ మనస్సుకు మైత్రీ సంగం నేర్పాలె. ఆ వ్యసనం, ఆ తీపీ నిలబడే సాధన కావాలె. అవునా?

వకుళ: నిజమే. కాని, ఆ విధాన మేమయినా సమాలోచనం చేశారా మీరు?

సునందు: ఆ...ఆ విధానసూత్రం కవి హస్తంలోనే ఉన్నది. వలసిన తీపీ-దిమ్మా-వారి వాక్కులో చిక్కింది. అందు చేతనే కావ్యం ఉన్మాదన తంత్రంగా, మచ్చు మందుగా,

ఉపకరిస్తున్నది. ఇది చిత్తప్రసాదన మంత్రంగా ఎందుకు వినియోగపడదు? మాపుతగలని పటంమీద శాలీన సారంగమును చిత్రింపవచ్చు; లేక, భయానక భల్లూకమును లిఖింపవచ్చు. గానంలో శ్రుతి, రాగ, లయలు సంమేళన ములై, మనస్సును మెత్తగించి, కరిగించి, సుఖసరస్సులో తేలించుతవి. కావ్యంలోకూడా ఈ రహస్యం గమనించాలె.

వకుళ: తమ్ముడా! నీ మేథాపుష్పము పూర్ణంగా విచ్చింది. ఎంతో దివ్యగంధం వీస్తున్నది. చిత్త వికార నిజపరిజ్ఞానంతోపాటు, తత్ప్రసాదన సాధనకూడా నీకు విశదమైనట్లు తోస్తున్నది. చెప్పవలసినదంతా చెప్పుతున్నావు. ఈ శుక్రవాసరం శుభదినం. కానీ–

సునందు: మొట్టమొదట కావ్యపదం సామాజికులకు శ్రుతిసుఖమియ్యాలె. పిమ్మట – అనురాగంతో – ప్రియురాలు ప్రియునివలె – (పెదవి కఱచి, ఇంచుక ఆగి) తల్లి. బిడ్డనువలె ఉపలాలించాలె. అంతేకాని, కావ్యంలోని అనురాగం మార్జారప్రణయంలాగా, కర్ణకఠోరంగా, చిత్తవిక్షేపకంగా ధ్వనించకూడదు.

వకుళ: అంటే–

సునందు: అంటే బిడ్డకు పాలిచ్చి, నీరార్చి, నిదురపుచ్చే బాలెంతరాలి బాళినీ, చెంపలు దువ్వి, తిలకము దిద్ది, చీరా రవికా సవరించి, కన్నెను తీర్చే పిన్నిప్రేమనూ, చల్లగా చనువు సళుపరించేలాగు వాకులో, వాలకంలో విప్పారేటట్లు విరచించాలె.

వకుళ : (తనలో) అస్ఖలితబ్రహ్మచర్యలో అనాహత నాదమువలె రసస్వరూప మున్నట్లు తోస్తున్నది. (ప్రకాశంగా) సునందా! సాందీపగురుకులంలో అతీత సౌందర్య స్వరూపం తాండవిస్తున్నమాట సత్యం. మీ గవేషణ మా కందఱకూ అపూర్వ కళాసమున్మీలనం కావిస్తున్నది.

సునందు : విదుషీ! సాహితీ విచికిత్సలో ఇటీవల పరంజ్యోతి ఇల్లా ఉపన్యసించాడు. ఆతని వాక్కులు జ్యోతిర్మయంగా ప్రకాశించినవి. వాటిని తూ చా తప్పకుండా స్మృతి సంధానం చేసికొన్నాను. విను. వినతగినవి; మననంచేసి మన్నింప తగినవి.

వకుళ : కుశలమతీ! అంతకన్న మఱేమి కావలెను. అవధానంతో, అతి శ్రద్ధాకుతుకములతో, అవహితనై ఉన్నాను.

సునందు : కావ్యబంధము దృశ్యరచనలో అధిక ప్రభావము నందును. అది సాహితీ సీమంతమణి వంటిది. వకుళ— (అవశంగా జంకు నభినయించి) ఆ...

సునందు : అతివా! ఎందుకో చివుక్కుమన్నావే. వకుళ (స్తిమితము నభినయించి) ఏమీ లేదు గురుపుత్రుడా? పరంజ్యోతి పరమ మీమాంసను వినుటకు సంసిద్ధనగుచుంటిని.

సునందు : ఔను. బాగా గమనింప తగినదే. నాటకము నరనారీజనుల నటన. కాబట్టి, ఆ నాటకము చూచేవారి గుండె కరగపోతే, చూపు సుస్నిగ్ధం కాకపోతే, మనసు మధుమయం కాకపోతే విరచన విఫలమవుతుంది. మానవుని

అడుగుజాడలు కనబడాలె; మగువ మంగళస్వరం వినబడాలె. ఆ యా రంగాలలో నడిరేయి తలుపు తట్టిన చప్పుడు కానీ, ఏకాంతంలో ఎలుగురాల్పబడిన కంఠంగానీ, పోనీ—విప్రలంభ ద్వారాల క్లాంతా క్లాంతమైన చింతా శ్రుతిగానీ రాకపోతే ఎందుకు ఆ నాటకం?

వకుళ: నిజం...

సునందు: చేష్టలలో భావం చిందాలె; పలుకులలో పాలు చిలకాలె. నాటకానికి ప్రాణనాడి అదీ. అంతేకాని, ప్రియుడు చచ్చిన ప్రియురాలితో-ప్రియురాలు పోయిన ప్రియునితో-పెనబడే అనిష్టగాథలలో, రాజుల రణదాహం రక్తధారలతో తనిపే మారణ సంఘటనలలో, ఘాతా, ఘరణా, ద్వేషం, ద్రోహం, హింసా, హత్యా అవిభాజ్యంగా పురులెక్కి, ముడిబడీ, సామాజికులు నిర్ఘాంతపొయ్యే భీభత్స సంనివేశాలలో రూపకల్పనకు తగిన ఇష్టార్థం ఇముడదు. పైగా జీవితం కేవలం రాక్షసాంశ కాదు. అందునా మానవుడు మనో బుద్ధి అహంకారములచే విశిష్టుడై, యుగయుగాంతర విజ్ఞాన శిక్షావాసనలు గల జీవి. ఈ కారణాలచేతనే దుర్దారుణ నిష్ఠురములైన క్రోధ క్రౌర్యాది భయానకములను ప్రాణేంద్రియములు సహించి భరింపలేవు. సామాజికులుకూడా ఎంతోసేపు చూడలేరు. అలాటి క్రూర సంనివేశాలలో విభావానుభావాదులకు స్థాయికూడా సంఘటిల్లదు. మానవత్వములో సౌకుమార్య శోభాదులున్నవి. అవి ప్రసన్నంగా పరిణతములు కావాలె; చిత్త ప్రసాదనం పొందాలె. ఆ

ప్రయోజనం రూపకముఖంగా జరుగుతుంది. చాక్షుష క్రతువువలన జనులలోని జంతుత్వము శమించుతుంది. జనులు సుజనులై, సుసంస్కృతులై, సుధారణాచణులై సమాజమును వినయవిరాజనం చేయాలె. అదీ సాహితీకి లక్ష్యం. ఉత్సాహమూ, ఉత్సుకతా, ఉల్లాసమూ ప్రాణికి ఉజ్జీవ పోషకములు. పయిరగాలి పచ్చ పొలానికిలాగా, ప్రపంచ ప్రవృత్తి కష్టసుఖ కల్లోలంగా ఉన్నది; ఉంటుంది. ఉగ్ర దృష్టిలో, ఉద్రేక ఘోషలో ప్రాణిని ఆదుకొనే సత్వాంసలు లేవు. సాంత్వనంలో, సామరస్యంలో, సమాధాన సారళ్యంలో అభయోపచారము కలదు. ఇలాటి చల్లని కల్పనలకే కళలు ఉపకరిస్తవి. హాయి కులికే వేణువూదితే పోట్లకోడె పులకించి నిలబడుతుంది. తప్పెటలు వాయిస్తే మీదబడి త్రొక్కుంది. (నిమిష మాత్రము నిశ్వాసము విడుచును)

వకుళ : (శాంతి భ్రాంతులు మిశ్రమంగా అభినయించుచు) సహృదయ కిశోరమా! పరంజ్యోతి పంక్తులు అమృతధారారక్తములుగా ప్రసరించినవి. ఇది ఒక మహత్తరమైన అభినవ దర్శనంగా సంభావిస్తున్నాను.

సునందు : సోదరీ! సత్యంగా 'దర్శనమే'. పరంజ్యోతి తన సాహిత్య ప్రతిపాదనమును ముగించే వాక్యములు విను. చ్యుతసుందరిని బహిష్కరింపని బ్రహ్మచారిణులూ, పతితులకు తొలగిచనని ప్రియవాదులూ కావాలె లోకానికి. వారే నాటకాలలో పరివర్తన పొంది, పొందింపగల, కుశీలవులగుదురు.

వకుళ : పునః అంతస్తాపము సూచించి (తనలో) ఆహా! పరంజ్యోతి హృదయ కువలయమెంత ప్రేమజ్యోత్స్నా మయము.

(తెర వ్రాలును)

## ఆఱవ రంగము

రేవతీప్రాసాదం

సుగంది పాటపాడుతూ పెరుగు చిలుకుతున్నది

సుగంధి: కూడీ కూడని క్షీరకుండికను
కుదిలించెదరే సఖుడా!
త్రాగే తుమ్మెద తనియకపోతే
ఇచ్చేపూవున కేముద్దో!
వన్నెలువాడీ, చిన్నెలు చిదికీ
నవకమునలిగీ చెదిరేచేష్టలు
అందంబంటే నమ్మేరా—ఆ
నందంబంటే ఒప్పేరా...

విభాదేవి ప్రవేశించును

విభ: సుగంధీ! ఇల్లంతా పల్లవించేటట్లు, పరిసరమంతా పరిమళించేలాగా పాడుతున్నావు. నీ వల్లభుడింట్లో ఉన్నాడా!

సుగంధి: (కవ్వపుత్రాడును చల్లకంబానికిచుట్టి హస్తములు ముకుళించి) కులపాలికా! నమస్కారము! కలుష కాసారంమీద ఆదిత్యరేఖలాగా ఉన్నది నీరాక. ఎన్నిసారులో భగవతిని ఆమతించి, వినయార్చన చేయాలని నేనూ, నాథుడూ అనుకొన్నాము.

విభ: మఱి అయితే ఎందుకు పిలవలేదు?

సుగంధి: ప్రతిపర్యాయమును నా సంశయాత్మ నన్నడ్డగింపగా ఏదో సాకుపెట్టి తారసించాను. నా ప్రియుడుకూడా

సావాసనంకటమున కాబోలు ఉపేక్షించి ఊరకుండేవాడు. ఇల్లా దినసములు దాటిపోయినవి. నేడు పుణ్యాయోగం. (అనుచు ప్రేముతో అల్లిన పీటవేసి విధేయముఖియై) దేవీ! సుఖాసీనవు కమ్మని. (అని చేతులుజోడించి నిలుచును)

విభ : కుమారీ! శుచిమంతుల సంకల్పములే సంతర్పణాలు. ఉపచారము లక్కరలేదు. మీరందఱును కుశలమా? ఏదీ! మళ్ళీపాడు! దధిమథనమర్ధల ధ్వనులతో నీ కలకంఠ గీత మెంతో స్వాంత సముదింతంగా వినబడ్డది.

సుంగధి : (మారాడక 'కూడీకూడని' అనే గేయము పాడును)

విభ : చిన్నదానా! నీ దధిభాండములో పొర్లిపోయే నురుగులలాగా నాచిత్తంలోకూడా ఏదో ఉచ్ఛ్వలస్వచ్ఛ స్వాదుఫేనము పొంగుతున్నది. మంచిది. ఈగేయ మెవరు వ్రాసిరి?

సుగంధి : నారయణుడే రచించాడు.

విభ : ఆ! నేనుకూడా అలాగే అనుకొన్నాను. ముక్తామణి మాలవంటి ముగ్ధచరణబంధంలో సుభాషిత సౌభాగ్యం తరళిస్తున్నది. కాని, చాకిరేవు మొదలు చంద్రశాలదాకా వినవస్తున్న అతని పాటలలో ఇది ప్రచారానికి వచ్చినట్టులేదే?

సుగంధి : పిన్నీ! అవును అదినిజమే. ఈ వెన్నయింకా మా యింటనే, నానోటనే నిలిచిపోయింది. దీనిని బయట రానీయు లేదు. నేనే అందుకు బాధ్యురాలను.

విభ : ఎందుకంత స్వార్థవైనావు? సుందరలేఖన ప్రకాశనం, సుస్వర కలాపవ్యాపనం ఈరెండూ పుణ్యకాండలో

చేరినవే. వీనిలో మానవీమానవ మానసము తరంగించే ప్రభావమున్నది. నేను పఠించి, పాడి, గోకులంలో ప్రచారమునకు తెస్తాను. ఇంకొకమారు పాడూ!

సుగంధి: వరవచస్వినీ! వలదు! వలదు! ఇందులో కష్ట కలుషమైన ఇష్టాపత్తి ఉన్నది.

విభ: అది యెట్టిది?

సుగంధి: జననీ! (అని లజ్జానుతాపము లభినయించును)

విభ: బిడ్డా! వగకైనా, వగపునకైనా వాత్సల్య వైకుంఠములో దాపరికం అక్కరలేదు. కట్టలుతెగి, మిట్టపల్లాలపాలైన శైవాలినీసంతతి సైతం సముద్ర వక్షములో తలపెట్టి శాంతించుచున్నది. నీ కెందుకీ ముందు వెనుకలు?

సుంగధి: ఉపాధ్యాయీ! ఉదాత్తచిత్తవు. నీదర్శనం పిపాసువులకు పీయూషశాలవలె నాకు నేడబ్బినది. విపరీతంగా తపింపచేస్తున్న నా సందేహదాహం చల్లార్చుకొందును. భద్ర బాంధవీ! ఈనాడు ఉద్రేకించిన స్త్రీజన సంక్షోభ నీచెవి సోకియుండును.

విభ: విన్నాను; కన్నులారా కన్నానుకూడా. కాని, ఈ పురుష విముఖ విగ్రహానికి మూలమేమిటో బోధపడడంలేదు. అయితే, ఈ ప్రచండ ప్రతిరోధమునకు కారణమేదో ఉండవలెనని అనుమానించాను. బిడ్డా! ఈ విరూప రూపకానికి నేపథ్య పరిచ్ఛేద మెట్టిదో తెలిపెదవా?

సుగంధి : శుభ్రమతీ! లోకంలో స్త్రీ పురుషులకు పరంపరాగతంగా ప్రధాన ద్వితీయావస్థానము లబ్బినవి. శబ్దబ్రహ్మ సంస్కృతమయిన సమస్త పదఘటనకూడా దీనినే బలీకరిస్తున్నది. అసంఖ్యాకంగా విస్తరింపగల సంఖ్యాకల్పంలోకూడా ద్వితీయమే కూడినా, గుణించినా, అవికల్పంగా నిలుస్తున్నది. ఈకారణాలవల్ల ద్వైతబంధమే సత్యప్రస్థానమని సిద్ధాంతం కాలేదా?

విభ : బుద్ధిమతీ! సిద్ధాంతం మాటకేమిగాని, నీ మీమాంస మిక్కిలి ముచ్చటగా ఉన్నది. అయితే—

సుంగధి : ప్రాణిపాయకమైన పాశవనైజం ఇరువురిలోనూ అపరిహార్యంగా ఉన్నది. ఆ పశుప్రసక్తి ప్రసారములను మానుషంగా మార్దవించి, సుమానుషంగా సౌష్టవించి, సురభూయ సుందరం కావించడమే స్త్రీపుంస యోగం. ఇది కేవల తర్కతంత్రముకాదు; అసిధారా నిశితమయిన అఖండ వ్రతము.

(తెరలో)

పెరిగాము చిన్నపుడు విరుగు తరుగులు లేక
పారివోని నేస్తమున పొందునా పొత్తునా—
మంత్ర తంత్రాలలో జంత్రవాద్యాలలో
తెరమెత్త తలవంచి పరిణయంబైనాము

విభుడయ్యె అతడంత
వెలది నైతిని నేను

సుగంధి : విన్నావా! అదిగో, నీళ్లుతీసికొని పోతున్న మధురాపురీ పురంధ్రులు తమ అవగీత గీతను పాడుతూ వెక్కసం వెళ్ళిపోస్తున్నారు.

విభ : కుమారీ! విన్నాను సోదరకాంతల క్రాంతికీర్తన. మిథునవ్యవస్థలో ఈనాడు మీరు గుర్తించిన వైషమ్యం క్రొత్తదికాదు. మానవ స్వరూపంలోనే ఈవ్యవస్థ రెండు సగ సగాలుగా ఉన్నది. ఈ రెండు సగాలూ ప్రకృతి పురుష ప్రతిపత్తిలోనే ఉన్నవని కొందఱు పురాణ బ్రహ్మవాదు లనక పోలేదు. అకామంగా సృష్టి జరిగింది. నాడుమొదలు నేటి వఱకును ప్రకృతి పురుషులు ఏకం కావలెననే అవ్యక్తసూత్రం ఇద్దరినీ సమానంగానే లాగుతున్నది. అందువల్ల స్త్రీ పుంస యోగంలోకూడా ఈ ద్వంద్వస్థితి విరుద్ధం కానక్కరలేదు. కానిమ్ము. ఇప్పుడిది ఇంత ఉపద్రవంగా ఉద్వేగించడానికి హేతువేమి ?

సుగంధి : పావనీ! పిల్లల కల్లోలమును తల్లియే తీర్చాలె. సంనిహితకారణం నీకుచెప్పి, ఆదోష పరిహారమునుకూడా అడిగి తెలిసికొంటాను. (కొంచెము నిదానించును) పురుషుని కామితం అనంకుశంకావడం, హద్దులుదాటడం, అసలు దాని మితిమేరలే తెలియకుండా తీవరించడం తటస్థించింది. విజ్ఞాన కాండలోకూడా దీనికి నికర్తనంగానీ, ప్రాయశ్చిత్తంగానీ కానరాలేదు. పైగా, త్రివర్గాంతరమైన కామం పూర్తిగా పురుషసుఖావశేషంగా అపదిష్టమయి భ్రష్టం కాసాగింది. మఱిన్నీ, పడుచుతనవు సుడిగుండాలుపడి దుర్యోగభ్రమణంలో

చొచ్చుకొని పోసాగింది. ఇక, కుటుంబకాసారం క్రుళ్లుగుంట అయిపోదా ?

విభ : సుహాసినీ! అమరావతిదారి అడిగితే అలకాపురి మీదుగా చూపుతున్నావు; సూచిస్తున్నావు. కాని, సూటిగా చెప్పడంలేదు. నీ నాథుని నైపుణిచ్ఛాయలు నీకుకూడా బాగా అంటినట్లున్నవి. ఉన్నదిచెప్పు. నేనునూ ఆడుదాననే.

సుంగధి : సుశ్లోకినీ! క్షమించు. ఇక చెప్పివేస్తాను. లీల, సుభాషి వీరిద్దరు ఆశైశవ స్నేహితులు. నీవు వినియుందువు. ఎందుకింత, జగమెఱుగును, నేను బాగా ఎఱుగుదును. నమ్ము; నేను చెప్పేదంతా నమ్ము. సుభాషిపట్ల లీలకు మైత్రీ ముదిత భావనలుతప్ప వేఱులేవు; త్రికరణయూలేవు. ఆమె అంతరంలో, అభిలాషలో, అనువర్తనలో ఇసుమంతైనా ఇతర సర్మస్పర్శ కానరాదు. అనుమితంగానైనా నాకు, నాకేమి—ఎవ్వరికీ కూడా, శంకాస్పృహైనా తగులలేదు. ఇలాటివారిమైత్రి మలినమై, మసిపాటె చెడిపోయిందంటే పురుషుణ్ణి ఏమనాలె ?

విభ : చెడ్డదా! ఎలా చెడిపోయింది ?

సుగంధి : ఊరినుంచివచ్చి ఇంట్లో కాలునిలువక అతడిని చూడబోయింది లీల. దొడ్డిలో మల్లెపందలిని సవరిస్తున్నాడట సుభాషి. ఆగలేక అక్కడికేపోయింది ఆబేల. చుట్టు ప్రక్కల ఎవ్వరూలేరు. లీల అతని దండనంటె నిలువబడ్డది. ఆకస్మికంగా ఆమె చుబుక మందుకొని చుంబన చేసాడు. ఆ పిల్లకు అంతా అయోమయమై పోయింది. ఇంచుక తేరుకొన్నది. ఇల్లుచేరింది. ఉండ బుద్ధిపుట్టలేదు. భయము బెట్టిం

చింది; మనసు మారుమసలింది. ఏమీతోచక మా యింటికి పరుగెత్తి వచ్చింది. తెగీతెగని వాగ్బంధంతో తన కథను కన్నీళ్ళతో తడిపి నాకిచ్చింది. నా బుజాలమీద రెండుచేతులూ వేసి 'అక్కయ్యా! నా ముఖమాలిన్యం ఎలా పోతుందో ముందుచెప్పు' అన్నది. ఇద్దరమూ కొంతసేపు సంతపించాము. నా కేదో స్ఫురించింది. తోడనే పాదప్రక్షాళనచేసి, పీతాంబరం కట్టుకొని, మా పూజామందిరంలోనున్న గంగాతీర్థము తామ్ర కలశములో వంచాను. తులసికోటలోని దివ్యకణమింత తెచ్చాను. తలుపులుమూసి లావణ్యావరేణ్యమయిన దాని ముఖాన పూసాను; రాచాను; తుడిచాను; తోమి కడిగాను. అప్పటికి ఆ దీనకు కొంత ఊరట కలిగింది. 'పోతానే! మాఅమ్మ అరుస్తుంది' అంటూ వెళ్ళబోయి గోడమీది అద్దంలో చూచు కొన్నది. ఈ-ఈ-సీ-సీ-అని అశ్రుక్లిన్నస్వరంతో 'పోలేదే అక్కయ్యా! మైలపోలేదే, మకిల వదలలేదే' అంటూ తన్ను తానెరుగని తారుమారు తంద్రలోపడి, అడుగులు తడబడగా, అధోముఖియై వెళ్ళిపోయింది. అనిచ్ఛాపాతములైన ఈ పాత కాలకు నికర్తనమెల్లా? ఈ ఘాతకు ప్రతీకారమెట్లు? స్త్రీ జన శీల మెల్లప్పుడూ కదళీకంటక సాంగత్యంగా భయపడ వలసిందేనా? ఉభయత్రా ఛిన్నంకావలసింది స్త్రీ జీవిత మేనా? దోషాదోష విచారణయందు ధర్మశాసనము ఇల్లా ఏకైక పాక్షికమై పోయిందా?

విభ : కులీన కౌముదీ! ఈ మైత్రీఘాతక కథనం చేస్తుంటే నీకంఠం కాతరమయింది. ఇక నీ అంతరమెంత దురంత నిర్ఘాత నిహతమయిందో ఊహింపవచ్చు. ఇప్పు డింత చందనం

ప్రాయాలె కనబడని నీ కాకకు. విను: ఈ స్త్రీ పురుష తంత్ర మునువిప్పి విడదీస్తాను. మానవ చరితమును విలోకిస్తే కాంతాలోకానికి ఈ కడగండ్లు ఎన్నడునూ తప్పలేదు. దీనికి హేతువును ఇలా ఊహించాను: స్త్రీచైతన్యములో దాక్షిణ్య ధాతువు అధికాధికంగా ఉన్నది. అందువల్లనే అలభ్యమానమయిన స్తన్యదాన సుకృతి ఆమె సొత్తైనది. సహజ సాత్వికమైన ఈ ధర్మముచేతనే ప్రాణిక్రతుకాండ పరిపూర్ణంగా, నిర్లిప్తంగా నిర్వాహక మవుతున్నది. ఇది అనన్యమయిన ఒక మహో చైతన్యానుభూతి. దీని మహిమవల్లనే స్త్రీకి లోకమంతా రక్తప్రజాసక్తంగా పొడకట్టుతున్నది. శైశవం అతినగ్నమూ, అజ్ఞాత విషయమూ అయినకారణం చేత స్త్రీ పుంస వైషమ్యమునకు ప్రసక్తిలేదు. ఇది లోకంలో కనబడుతూనే ఉన్నది. పడుచుదనము పల్లవించినప్పుడే ఈ సంబంధము విషమించడమూ, విరూపంకావడమూ సంభవిస్తున్నది. అయినా, దాక్షిణ్యమహోదయం సంఛన్నం కాలేదు. దీని విచార పరిహారములు స్మృతిసంహితలలో లభించుటలేదు నిజమే. పురాణ ప్రణవాదులు అకామహతులగుటచే వారికీ ప్రస్థానచింత పట్టలేదేమో. మహర్షి కళత్రములుకూడా ఈ దుర్విపాకం తప్పించుకోలేక పోయిరి. ఎఱుగవా?

సుగంధి: దృష్టాంతం?

విభ: అహల్యాఽనువృత్తం.

సుగంధి: అందున్న మహార్థమెట్టిదీ?

విభ : మాంగల్యవతీ! అహల్య పూర్ణదాక్షిణ్యమూర్తి. చింతామణీ, కామధేనువులకు నాథుడైనవాడు ఇంద్రుడు. విశేషించి, యజ్ఞయాగాదులలో పురుహూతుడు. అప్సరస కులానికి అధిపతి. అట్టివానికి కామలాలస తీరిందికాదు. ఆతని చేతము అహల్యాముఖ లక్ష్మీసంబద్ధమై విహ్వలించింది. దానితో, దేవేంద్రుడు అకించనుడై, అతికృపణుడై, యాచ్నాదీనుడై, దాక్షిణ్యగుణకుల్య అయిన అహల్యను కామ్యభిక్ష పెట్టమని అర్థించెను. ఆ మహాపతివ్రతకు అది దుస్తరమైన దుస్సంధి తరుణం. అటు దాక్షిణ్యంతో కరిగిపోతుంది; ఇటు శీలభంగ మునకు తపిస్తుంది. తుదకు తన స్త్రీ చైతన్యస్వభావమే గెలి చింది. తన జీవక్షీరములను ధారవోసి అమరేంద్రుని బ్రతికించి, తాను పాషాణమైపోయింది.

సుగంధి : ఆచార్యాణీ! అదెట్లు సంభవము? నీవు కావిం చిన ఉదాత్త వ్యాఖ్యానమునుబట్టి దాక్షిణ్యాది రూపమైన నారీచైతన్యము ప్రత్యణు పరమమైన మహా స్వాతికాంశగా తేలింది. అలాంటప్పుడు దాని ప్రభావ మింతమాత్రమే అగునా? అగ్ని కలుషిత మౌతుందా?

విభ : కాదు! కాదు! దాక్షిణ్యప్రభావము అనంతం; అనా హతం; అనపాయం. అయితే, నిమిత్తమాత్రంగా ఏతద్విని యోగం పరిణమిస్తుంది సూర్యచంద్రుల తేజః ప్రసారంవలె. అందువల్లనే, అనసూయాది తపస్వినీమతల్లులలో ఈ ప్రభావం మాతృ మహిమారూపంగా భాసించింది. సిద్ధిలో శుద్ధివిచారణ అక్కరలేదు. ఎందుకంటే, శుద్ధమైతేనేకాని సిద్ధికాదు— ప్రసూత అయితేనేకాని పాలిండ్లభాగ్యం సఫలించనట్లు.

అనసూయ మహామాతృ స్వరూపిణి. ఆమె త్రివర్గశుద్ధిని పరిశీలించ వచ్చారు త్రిమూర్తులు.

సుగంధి. పురుషులను ఏకాలంలోనూ ఈ స్త్రీధర్మ పరీక్షావ్యసనం వదలినట్లులేదు.

విభ : పోనీ, అలాగేకావచ్చు. కాని, ఆ నిత్యాజనయిత్రి పవిత్ర సమక్షంలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులుకూడా నగ్నులై, నిరర్ధకులై, నిష్కృతులుకాక తప్పలేదు.

సుగంధి : భద్రభాగినీ! అబోధమైన స్త్రీ జీవిత రహస్య మును నేడు నీవలన తెలిసికొని ధన్యనైతిని. అప్పుడప్పుడు నావల్లభుడు ప్రణవ, ప్రణయ వివేచనము కలాపితో చర్చి స్తుంటే వినేదానిని. అందీ విషయం కాదాచిత్కంగా సంగత మవుతుండేది.

విభ : అవును. ఈ జీవద్గుప్త తంత్రమును హృదయ వాదులు ఇంచుమించుక సమాలోచనం చేస్తున్నారు నేడు. ప్రణవమంటే ఆదియందు నవస్వరూపంగా ముఖీకృతమైన అనాహత నాదం. ఆ ప్రసన్న ప్రాణశ్రుతి చూపి ప్రచోదించిన లోకనయమె ప్రణయం.

సుగంధి : అక్షరమూలావాల్లవైన ఈ జీవలక్షణం ఎంత విచక్షణంగా ఉందో అంత అంతరాపాయ్యంగా హత్తింది. ఏదో ఆపాత విమలామృత సేచనలో తడిసిపోయాను. నా చెలి—

(తెరలో)

స్తన్యంబుతో నబ్బె తాకితే మానేటి
పసిపాప నవకముల పసిమికోమలికమ్మ
మవ్వంపు మెఱుగుతో నవ్వు మీగడమిసిమి

మధువు నాస్వాదింప మరిగి నప్పటినుండి
నళ్ళేను ఆవన్నె-త్రెళ్ళేను ఆచిన్నె
కనవోయి సఖుడ! ఈ కనరాని సుఖశోష

సుగంధి: అదిగో వకుళ! దానికి నూరేండ్లు. ఓపరాని అనుతాపమును పాటలో వెళ్ళబోసుకుంటూ వస్తున్నది.

విభ: అవును. వకుళం వాడిపోతున్నది. ఎక్కడ ఎండ తగిలిందో?

సుగంధి: తల్లీ! దానికథ తుహిన నిహితమైన శతపత్రం వలె పాపతాప విద్ధమయింది. దానిచేతనే చెప్పిస్తాను.

[వకుళ పాటపాడుతూ ప్రవేశించును. మాసినచేలం, దువ్వని శిరోజములు, చింతాకృత్తమైన ముఖం.]

సుగంధి: చెలీ! ఎక్కడనుంచి వస్తున్నావు?

వకుళ: ఇంటినుంచే?

సుగంధి: ఇదే, భగవతి విభావతి. నీవు వినియుందువు. అభివాదమునలిపి, ఆశీస్సులు అర్థింపుము.

వకుళ: (విభావతివైపు చూపులునిలిపి) వర్చస్వినీ! వందనము. నేను ఆశీస్సుల నడుగుటకు అర్హురాలను కాను. అభయమును, అనునయమును యాచింపవలసిన సాపరాధను.

విభ : పుత్రీ! విచిత్రవాదం చేస్తున్నావు. మధురా వీధు లలో అపరాధులున్నారా? ఉంటారా?

సుగంధి : చిద్విలాసినీ! ఈ చెల్లిని చింతా చింతనములు రెండునూ పురిగొని, పెనవేసికొని ముడివడ్డవి. నీ సాన్నిధ్య స్నేహంతో తడిపితే - తడిస్తే సళ్ళితమంత తాము విడిపోతవని నా విశ్వాసము.

విభ : అకుటిలమైన కుటుంబనందనము అలంకరించిన అమ్లాన వకుళమాలవు! నీవయసు వాల్లభ్యములకు అప్పుడే ఎట్లు వ్యసనగ్రంథు లేర్పడ్డవి?

సుగంధి : (వకుళ హస్తమును పట్టుకొని) చెల్లీ! తల్లియెదుట ఎల్ల ప్రాణికులమును నగ్నశిశుప్రాయమే అవుతుంది. విభా దేవి ఇప్పుడే ఆ మహాదర్శమును నిరూపించింది. సుకవుల ముందు సుభగవాక్కు ముక్తాచ్ఛాదనమైన ప్రియకలాపం నెఱపుతుందని నా నాథుడు పలుకుతూ ఉంటాడు. కాబట్టి, నే నడిగే ప్రశ్నల కన్నింటికీ లజ్జా, భయ, శంకా లవలేశాలు లేకుండా సమాధానాలు చెప్పాలి.

వకుళ : అక్కయ్యా! ఎంత నిర్దయురాలవైనావే! నా పాపానుశీలనం, ఇంతవఱకూ, నాలోనే - కుకూలంలాగా - కుములుతున్నది. దాన్ని ఊది, ఉద్వేగించి పరిసరమంతా పొగపెట్టమంటావా? నిష్ఠూరాలకే నెలవయింది ఈ నిర్భాగ్యురాలి బ్రదుకు.

విభ : సుందరీ! నిందించుకోకు. ఆత్మాపకర్ష వినయ వాచకమైనా అనుత్సాహమునకు సందిస్తుంది. సుగంధిని

చురచురచూడకు. దాని కాఠిన్యం చందనపు చెక్కలోని కాఠిన్యం వంటిది. అది గంధంలో ఉండదు కదా ?

సుగంధి : మాతా! సుఖదుఃఖాలను సరిసమానంగా పంచుకొో కలిగినవారే సఖులు. ఏ దేవతలకు ఏ పుష్పాంజలి అర్ఘ్యమిచ్చిందో వకుళ! ఆ పూర్వపుణ్యము పూర్ణోదయ మైనట్లు దీనికి అతిలోకమైన అనన్య రూపలావణ్యా ప్ఫాతి ప్రాప్తించింది. ఆ సౌందర్య భాగ్యమును, ప్రజలు సామ్రాజ్య సంపదనులాగా పంచుకొొని గర్వించిన వాళ్ళలో నే నొకతెను. త్రిలోక దుర్లలితమైనది దీని చక్కదనం. అది ఎన్నడూ వన్నె తగ్గేది కాదు; వాసన వాడేదికాదు. అట్టి తరుణ తను శోభ శిశిర శిథిల శతపత్రంలాగా ఈమధ్య కసుగంది కమిలిపోతు న్నది. అపరంజి వెన్నవంటి దీని అంగాంగ లావణ్యం, శుద్ధ స్నాన పరుషమయిన కేశపాశంవలె నిష్కామలమై నిషుర కర్కశ మవుతున్నది. కాటుకర్రాగని కన్నులవలె చెలువు చిన్నెలు వన్నెవాసి, వెల వెల పాఱుతున్నవి. ఈ వికృతికీ, వైకల్యానికీకారణం మైత్రీ మూలముకావడం మఱింత సంతాప కరం.

విభ : కుమారీమణులారా! మీాగాయములు కానరానివి. అవిపెట్టే తీపులుకూడా చెప్పరానివే. నేనిప్పుడు కొంతకొంత గుర్తింప కలిగితిని. సావాసం మహా గహనమువంటిది. అది స్వస్థచిత్తులగు వైఖానసులకువలెనే, అబద్ధ వృత్తులగు వ్యసన వశులకుకూడా ఆశ్రయ మవుతున్నది. కానిండు. అయితే, నే నిప్పుడు తెలిసికోవాలె. వకుళను వ్యాకులపెట్టే అనిష్టాపత్తి యెట్టిది ?

సుగంధి : వకుళా! చెప్పుతావా... చెప్పు... చెప్ప లేవులే! నేనే చెప్పుతాను. తల్లీ! ఈ చెల్లికీ, సుందరుడికీ చిల్లా పొల్లా లేని చెలికారం. (కొంచె మాగును. అటు వకుళా ముఖమును, ఇటు విభవ నేత్రములను చూచి తాను కన్నులువాల్చి) ఆఁ... 'నాదీపం ఆరిపోతున్నది! ఆర్పివేస్తావా' అని అతడు క్రూరంగా మోమోట పెట్టితే... ఈ సుమిత్రా దేవి అమలినమైన స్నేహంతో పాటు, అస్ఖలితమైన తన శీలమునుకూడా ధార పోసింది... (కనులకు నీరు వచ్చును)

విభ : శేషం బోధ అవుతున్నది. దాక్షిణ్య క్షమయైన కాంతాకులానికి, రసాలంకార సలక్షణమైన సాహిత్య చయనమునకు వలెనే లోకాపవాదం పీడ తప్పినదికాదు. స్పష్టంగా ఉన్న ఈ సృష్టిరహస్యం ఎప్పటికి ఆ విస్మృతం కావలసి ఉన్నదో!

సుగంధి : అమ్మా! స్పష్టంగా ఉండే రహస్యంకూడా ఉంటుందా?

విభ : వత్సే! పరమాత్మ కలాప్రస్థానమైన ఈ శరీర శివాలయమును పరిశీలించుము; ఇంచుక శారీరక మీమాంసచేసి చూడుము. స్పష్టాస్పష్టమైన ఆ రహస్యం విస్ఫుటము కాగలదు. మానవ ఘటనలో ఎడమ ప్రక్కన హృత్కోశ మున్నది. కుడివైపున కుదురుకొన్నది కుక్షి. అందువల్లనే ఆడుబిడ్డకు పెండ్లిపీటమీదనూ, ధర్మాసనం మీదనూ కూడా వామాంకము సుస్థానమైనది. సహజమైన ఆ జీవత్స్వభావమే స్త్రీ పురుష నైజప్రవృత్తులలోకూడా సంలగ్నమయింది. హృదయాభరణ ప్రాయములైన దాక్షి

ణ్యాది ప్రసన్న గుణములు స్త్రీ చైతన్యంలో చిక్కబడ్డవి. కుక్షింభరణ పాక్షికములగు కామార్థ కాంక్షలు పురుషునిలో పాదుకొన్నవి. యుగయుగాంతర స్థావరమువల్ల అవి గట్టిపడి, కరుడుగట్టి, కడకు ద్రవప్రకృతినే కోల్పోయినట్లున్నది. ఇదే హేతువుచేత మానవీమానవ కుశల సాధన కాదగిన, కావలసిన కామయోగం విపర్యాతిరాగంగా వికలమయింది. వక్రించిన ఈ ధర్మార్థ చక్రము తిరిగీ ఋజుగతిని పొందితేనేగాని జీవితానికి త్రికరణ సౌమ్యమయిన సాంత్వనం కుదురదు. సాకల్యమయిన జనసాంత్వన సిద్ధిలోగాని విశ్వకళ్యాణము విస్తరించి విపాకము కాదు. దీనికంతా నరనారీప్రవృత్తి, ప్రతిపత్తి, సుబద్ధమూ, సువిశిష్టమూ కావడం ఆవశ్యకము.

సుగంధి: అయితే! నారీనరుల స్వరూప స్వభావములలో భేదం వివక్షించావుగదా; ఇక వారి సాధన సంపత్తులుకూడా వేరు వేరనే నీ ఉపదేశమా? తల్లీ! తేల్చి, తీర్చి చెప్పితే ఈ క్లిష్టావస్థలో భ్రాంతిభ్రష్టములైన మా మనస్సులు మఱల స్థిమిత పడతవి.

విభ: సుగంధీ! లోక సంగ్రహమే మానవులకు ప్రధాన ధర్మం. ఈ ధర్మము కర్మరూపంగా నిర్దిష్టము. దీని నిర్వాహణ కూడా స్త్రీ పురుష ప్రయుక్తికంగానే జరుగతగినది. అంతే కాని, ఎవరికి వారు అనుష్ఠించునది కాదు. ధర్మాచరణకు శరీరమాద్యమని మీరెఱుగనిది కాదు.

సుగంధి (దిక్కులు పరికించుచూ, దీర్ఘాలోచన సూచించును)

వకుళ : (అవనతవదనయై) భగవతీ! ఉభయాభినేయమైన ఆ మానవ మహాక్రతు వెట్టిది?

విభ : కుమారీ! ప్రజాతంతుపాలనమే నైజమైన ధర్మము. అది నీ వన్నట్లు మహాక్రతువే. అత్యంత గుప్తమయిన ఈ చేతస్సవన తంత్రములోనే జగదాప్యాయనమగు ఆప్త లక్షణ మున్నదని తెలిసికోవాలె. (పరిక్రమించి) సుగంధీ! మూగనోము పట్టినట్లున్నావే!

వకుళ : పూజ్యపాదినీ! త్రివర్గప్రకరణమంతా పురుషాధిష్ఠితమని అంటున్నారుగదా! లోకాచారంకూడా అలాగే ఉన్నది. ఇక, స్త్రీలకు జగత్కళ్యాణ సాధనలో భాగ మెక్కడ ఉన్నది? స్థానమేది? ధర్మకామార్థములు సాధించే యోగ్యతా, అధికారమూ పురుషులదట! అందు వినియోగించుకోతగిన ఉపకరణములు స్త్రీలట.

సుగంధి : (మాట అందుకొని) అరిసెలపాకం సిద్ధముచేయడానికి బుజీషములు వాడుకొన్నట్లు...

విభ : ఉద్విగ్నలు కాకండి. నిజ మదిగాదు. చిరపరంపరాగతములైన జనాపలాపములలో ఇది ఒకటి. అయితే, దీనికి అతి ప్రచారబలం అబ్బింది. అందుకు నరవృషభుల అహంభావ మెంత కారణమో, నారీమణుల బహూపచార వ్యసనంకూడా అంత హేతువే. అదీగాక, అనుక్షణమును జీవితములో స్త్రీలు జరిపే శ్రేయస్సవనంగాని, దానికి వలసిన సహజ సప్త సమిథలుగాని పురుషాధీనములు కావు.

సుగంధి : ఆ కాంతాసవన మెలాటిది?

వకుళ : ఆహా!...స్మృతికి వస్తున్నది. ఆభరణాలు ధరించేటప్పుడు పాడవలసిందని మా పిన్ని ఎప్పుడూ చెప్పేది.

విష : జ్ఞాపకముంటే పాడుతావా ?

వకుళ : ఆ!...(పాడును)

ధృతితోడ గృహంబు దిద్దవే
క్షమతో పసిపాప నెత్తవే
దయజూడవె బంధుజాలమున్
కరుణింపవె కష్టజీవులన్
శుచివై కులకీర్తి నిల్పవే
పలుకాడకు నిష్ఠురంబుగా
సఖు నేపకు ద్రోహచింతనన్

విభ : చూచావా సంప్రదాయవాసన. అనిష్ఠురమైన వాక్యాన్నూ; అనభిద్రోహమైన మైత్రినీ్న మగువలకు పెట్టని నగలు. తీయరాని దివ్యాంశలు. వీనితోనే సంతతమైన శ్రియశ్చయనం జరుపుతారు స్త్రీలు. స్త్రీ లేకపోతే శ్రేయస్సు లేదు. ప్రపంచము అరిష్టదష్టమై, నష్టమవుతుంది.

సుగంధి : తల్లీ! నారీ వృత్త మింతటిదైతే, ఈ దుర్దశ మెందుకు పట్టింది ?

విభా : సుమంగలీ! తొందరపడకు. సంఛన్నమూ, విచ్ఛిన్నమూ అవుతున్న ఈ మూలధర్మము కృష్ణయుగంలోనే పునరున్మీలనము కావలసియున్నది.

సుగంధి : శ్రీ కృష్ణావతార ప్రసక్తి వచ్చింది. తల్లీ! ఈ యుగదర్శన విశేషమును నిశ్శేషంగా విశదీకరించుము. నేడెంత సుదినమో!

వకుళ : తపస్వినీ! తత్వదర్శనం నాతల కెక్కదు. సుగంధికి వలె నాకు సూక్ష్మబుద్ధి లేదు. అయినా, అంతులేని జిజ్ఞాస ఉన్నది. కాబట్టి, గృహిణీజీవితంలో కుశలక్రతుకల్పము ఏలాగు మిళితమై అనువర్తిత మౌతున్నదో బోధిస్తే తెలుసు కొంటాను. కొంగు జారిందని కుమిలి కుళ్లుతున్న నాబోంట్లకు అది తారక మవుతుందేమో!

విభ : ప్రియంకరీ! నిజముగా, నిరవద్యముగా జగత్కళ్యాణము గార్హస్థ్య ముఖముగానే జరుగుచున్నది. విను. అపత్యగ్రంధిదళనంతో ఆడుదానికి పాణిగ్రహణ వ్రతము ఫలిస్తున్నది. తోడ్తో ఆమె చైతన్యమే పరివర్తన పొందును. అతీంద్రియమయిన ఒక అమృతస్పృహ చిగిరించును. తాను వరించి, పరిచరించిన ప్రాణేశ్వరస్వరూపమే ప్రచ్ఛన్నంగా శిశురూపమై పయ్యెదపై భాసించు భాగ్యమును గుర్తించును. ఇంతేకాదు. శారీరకంగా కలిగే పరిణామంకూడా మహత్తరమైనదే.

సుగంధి : అది యెట్టిది?

విభ : (కించి ద్దరహాసంతో) విద్యావతీ! ఎఱుగుదువు గదా: సాంగోపాంగ సోమమథనోన్మథనంతోగాని, దేవభూయమైన రసావతరణంకాదు. అలాగే, విను - విను - బహుమాస కఠోరభార ధారణ తరువాత కాని, ఆ తరువాతకాని,

ప్రసవవేదనావిద్ధమయితేనే కాని తనుకాండలో స్తన్య సముత్పత్తి కావడం లేదు. ఈ సాధర్మ్య విశేషమును సాకల్యంగా సంభావించండి. అచేతన ప్రాయమైన సోమలత రసీభవించడానికి ఎంతో మంత్ర తంత్ర క్రియాకల్పము విధాయకమయింది. ఇక సచేతనమైన శరీర బంధమునుండి స్తన్య స్రవణం కావడానికి ఎంతటి ఉల్లోల కల్లోలము జరుగునో ఊహింపవచ్చును. ఈలాగా బరువుమోసి, జీవధారా పూర్వకమైన స్తన్యదానంచేసే సుకృతి ఏకైకంగా నారీజనమునకే లభించినది. తమ అంతఃకరణావలోకనమును వివేకించి తెలిసికోవాలె కాంతాలోకం. ఆడుదాని అజ్ఞాత తమోగ్రహణం వదలితే పురుషకేతువుకూడా నవనీత కేతనం కాక తప్పదు.

సుగంధి : ఓహో! జీవిత లక్ష్యలక్షణములెంత దుర్మార్గములై పోయినవీ! సమాజము చక్క - చక్కనా లేని చీకటి కానలో చిక్కి ప్రాకులాడుతున్నట్లున్నది. అయితే, భగవతీ! ప్రసూత ప్రాప్తినే ఆనందావాప్తిగా సూచించావు. దాని భావం పూర్తిగా విశదముచేస్తే కృతార్థుల మగుదుము.

విభ : ఆనందమంటే ప్రాణిస్పృహణీయమయిన అమృతానుభూతి. విషయ వ్యాపారమంతా, సమంతంగా చక్కగా సహజంగా, సంపూర్ణ మయితేనేకాని ఆ విభూతి ఆవిష్కృతం కాదు.

సుగంధి : తల్లీ! ఇది అంత బాగా బోధపడ లేదు.

విభ : గాఢమైన కవ్వపురాపిడి తగిలితేనేకాని పొంగిన పెరుగు నురుగులు తేరి నవనీత సిద్ధికాదు. అలాగే విషయముల

త్రొక్కిళ్ళుకూడా హతాహత దుష్కృషణాధారతో ఘాతము లయినప్పుడే చేతనమునకు ప్రసవఫలితం అందుతుంది. ఆమీద స్తన్యపానసముద్దీపనంవల్లకలిగే తాదాత్మ్యసుఖం సువాసినులకే అనుభవైక వేద్యము. శిశుదశన పులకితమై పల్లవించే అనంగ భావానుభూతి బ్రహ్మానందమేనని నీనాథుడు మొదలైన మాధురీవాదుల మతము. సాధ్వీజనము ఈ మహా మాధురీ దర్శనమును తత్పరులై లక్షించవలసి ఉన్నది.

వకుళ : తల్లీ ! అపూర్వమయిన నీ వ్యాఖ్యానమును విన్న తరువాత నావల్లభుని మాధుర్యోపాసన ఆకళింప గలిగితిని.

సుంగధి : (వకుళవైపు తిరిగి) నీమగని నీవే పొగుడుకుంటే తన ముచ్చటకు తానే మురిసినట్లుంటుంది. సిగ్గు చితికిందని చివికిపోతున్న సీమంతినివి. నీపట్ల—

(తెరలో పాట వినబడును ; అందరు ఆలకింతురు)

కోయరాదురా ! ఈ
కువలయ కోమల కుసుమకోశమును, కోయరాదురా !
త్రెంపబోకురా ! ఈ
తీయనిజంటల తృణకంకణమును, త్రెంపబోకురా!
చెరపరాదురా ! ఈ
సృష్టి సుముఖ శుభ చిహ్నతిలకమును. చెరపరాదురా !

పొల్లుపోకుండానే వల్లనవేసాను గేయమును, ఎక్కడ పాడినా చెవులు నిక్కబెట్టుకొని నిలిచి పోతున్నారు ప్రజలు. నేడు కుశీలవులగోష్ఠి జరుగుతుందని విన్నాను. వెళ్ళవలెనని మనసు పెనగులాడుతున్నది. వెళ్ళితే, రానిస్తారో - రానీయరో.

ప్రస్తుతం విస్తరిస్తున్న కాంతా కలకలహ పర్వమును పరామర్శిస్తారట. ఏమయినాసరే, సభకు పోయితీరాలె. (అటు నిటు పరిక్రమించి ఆలోచించి) ఆఁ! మఱచి పోయినాను. విభాదేవిని పిలిచికొని రమ్మని ఆజ్ఞాపించారుగదా నన్ను. ఆమె మకరంద మందిరం వైపుగా వెళ్ళిందని అక్రూర శృంగాటకంలో చెప్పారు. ఈ సమీపంలోనే ఉండాలె. అది . . .

విభ : పాపం! శ్రావణకుడు వెదుకుతూ పోతున్నాడు నన్ను. సుంగధీ! తలుపుతీసి పిలుస్తావా?

సుగంధి ద్వారముతీయుట అభినయించును. శ్రావణకుడు ప్రవేశించును

శ్రావణ : భగవతీ! ఆత్రేయ సగోత్రుడు, శ్రావణకుడు అభివాదము చేయుచున్నాడు.

విభ : ఆయుష్మంతుడా! చిరంజీవివై, భాగవతవతంసుడవు కమ్ము.

శ్రావణ : భగవతీ! ఆచార్యపాదులు మిమ్ములను పిలిచి తీసుకొని రమ్మన్నారు.

విభ : వినీతుడా! సంప్రదాయ శిక్షపొందిన కులీనడవు. సమ్ముఖమందున్న సుముఖీమణులను చూడవలదా?

శ్రావణ : మాతే! నేను బ్రహ్మచారిని; మగ మొలకను. అది అల్లా ఉండనీ. ఈనాడు అహంకరించిన అబలా కోపాతపానికి తలవంచడమో, తప్పించుకోవడమో మంచిది.

సుగంధి : గురుకులవాసీ? నవనీత కళత్రము సుగంధి నమస్కరించుచున్నది.

వకుళ (కళవళపడుచు వెనుక ముందాడును)

సుగంధి: (గ్రహించి) కుమారవ్రతీ! ఇది నా చెల్లెలు. వకుళమాల.

వకుళ (నమస్కరించును, దూరమందుండి, చేతులు ముకుళించి)

శ్రావణ: ఓహో! ఇదంతా సాహితీ కుటుంబంగా ఉన్నదే! మీ కిద్దరికినీ ఇదేనా సోదరాదరము. (విభవైపు తిరిగి) తల్లీ! పోదమా! కుశీలవుల గోష్ఠికి వేళ అవుతున్నది. ఈ దినం వారిచర్చ చందనచర్చలాగా, మిక్కిలి ఇష్టార్థ వ్యవచ్ఛిన్నంగా ఉంటుందట. వినవలెననే కుతూహలం కుత్తుక బంటి ఒత్తుతున్నది.

సుగంధి: బ్రహ్మణ్యాకిసోరమా! నేడు కుశీలవులు సమావేశమవుతున్నారా? ఎక్కడ?

శ్రావణ: (పెదవి కరచి, నోరు జారింది) ఆ–ఆ–శుచీదేవి భగవతిని పిలుచుకొని రమ్మని పంపింది. తారసించానని తప్పు పెట్టుతుంది. పోవాలె. మాతే! వెళ్లుదామా (అని మోము అటు త్రిప్పును)

సుగంధి: (ఎదురుగావచ్చి) ప్రతిభామతీ? నేడు కుశీలవుల గోష్ఠి జరుగుతుందన్నావు. ఆ సభాస్థాన మెక్కడ?

శ్రావణ: అన్నానా, అన్నానుకాదూ, ఆఁ, లేదు, లేదు. నాకు కుశీలవులతో ఎలాటి సంబంధమూలేదు. ఆ... కాదు. విన్నాను కర్ణాకర్ణిగా. విన్నది అన్నాను. అది గాక, కుశీలవుల గోష్ఠిలో కాంతల చర్చ వస్తుంది. నేను బ్రహ్మ

చారిని; గురుకుల, సాందీపగురుకుల చ్ఛాత్రుడను. కావ్యాలాప ములు మాకు, మాకేమి, అందటికీ వర్జనీయములు. (విభవైపు తిరిగి) తల్లీ !

సుగంధి : ఔనులే. అది నిజమే. సభ యెక్కడ జరుగు తుంది? అదిగూడ విన్నదానినే చెప్పు.

శ్రావణ : గోష్ఠి సంగతి విన్నాను. సభాస్థానం గోలలో వినబడలేదు. కాదు...దానిని బాగా గమనించలేదు.

సుగంధి : ఉరుమువిని మెరుపును చూడకుండా ఉన్నావా?

శ్రావణ : ఆ! అదిగూడా విన్నానేమో...కాని, జ్ఞాపకం రావడము లేదు.

సుగంధి : అది నమ్మతగింది కాదు. సాందీప గురుకులము మేధావులకు పుట్టినచోటు; పెట్టిన పేరు. బృందావనములో తులసీ కదంబములు కాక, తుంబీవిత్తన్నములు మొలుచునా? ఉండునా ?

శ్రావణ : అయితే, అది మఱచిపోయినాను నిషిద్ధపంక్తి వలె...

విభ : కుమారచ్ఛాత్రుడా ! చెప్పితే యేమి ముప్పు వస్తుందీ ?

శ్రావణ : కాదు, కాదు. తల్లీ ! నన్ను మన్నించు. ఉభయత్ర భయకారణమే కలదు.

విభ : అదెట్లు ?

శ్రావణ : అమ్మా! కాంతపరణమంతా ఇప్పుడు కుటిల కల్లోలా క్రాంతమయింది. యువతుల ముచ్చట్లు యువకుల కెందుకని దండెత్తుతున్నారు; ముట్టడిస్తున్నారు. ఆ ప్రక్కన మా సతీర్థుల పక్షంలో బ్రహ్మచారులందరూ నన్ను ఆంక్ష పెట్టుతారు.

సుగంధి : అదేల?

శ్రావణ : చెప్పుదునా? విప్పి చెప్పుదునా? ఎందుకులే...

విభ : చెప్పుము. మీ రిద్దఱు వివేకవతులు.

శ్రావణ : కుశీలవులు కృతకవాదులు. ఉపనిషదుపదిష్ట మైన బ్రహ్మోపదేశరసమే సాహిత్యసముల్లసితమైన రస మంటారు వారు! ఇది అబద్ధము. అందుచేత అస్మాదృశులు ఆవాదం వినరాదు; వివరించకూడదు.

సుగంధి : పోగాక; వారి సభ యెక్కడ జరుగుతుందో మాకు చెప్పితే దోష మేమున్నది. నిన్ను ప్రార్థిస్తున్నాను- చెప్పుము.

శ్రావణ : నేను వయసులో నీకంటె చిన్నవాడను...

సుగంధి : అయితే, అనుచితమే. బ్రతిమాలుతున్నాను.

శ్రావణ : (తనలో) అబ్బా! ఆడువారి నస అంటుకుంటే అడుసువలె, ఆమదమువలె, వదలదు. ఏమి చెయ్యను? కింకర్తవ్యమ్? (తలగోకికొనుచూ ప్రకాశంగా) ఆ...ఆలస్య మవు తున్నది. గురుపుత్రి ఆజ్ఞ. తల్లీ! పోదాముర మనము.

సుగంధి : కుమారమిశ్రుడా! సభాస్థానమును చెప్ప లేదుగదా!

విభ: వత్సా! ఆ ముత్తేమంత మాట చెప్పరాదా! ఏమీ అపాయం రాదులే! నేను ఉన్నానుగదా!

శ్రావణ: అయితే, వాచ్యంగా చెప్పను. ఎందుకంటే అది అనృత మవుతుంది. చూపిస్తాను.

సుగంధి: మతీమంచిది. పోదాముపదండి.

శ్రావణ: ఎక్కడికి?

సుగంధి: సభాస్థానానికి...

శ్రావణ: ఆహా! బాగానే ఉన్నది. నేను మీతో రావాలా... అది విపరీతం; ఆచారవిరుద్ధం. ఇదిగో చూపిస్తాను. గమనించి గుర్తించుకోనుడు. పద్యంలో వ్యంగ్యార్థంలాగా...(అని రెండుచేతులును కలిపి, ముకుళ ముద్రాకృతిని అభినయించును)

వకుళ: ఓహో! తెలిసింది: ముకుళ నికేతనంలో కాబోలునే!

(తెరలో) గేయము

సూత్రము ఒకటే! సుందర సూక్ష్మ శుభాంకిత
శోభన సూత్రము ఒకటే!
జగదవలంబన చైతన్యమునకు సూత్రము ఒకటే!
సూత్రము ఒకటే!

సునిశితబలమై శుద్ధ శుద్ధమై
అణువు నజాండము అచ్ఛిన్నముగా
అంటి అంటక అవభాసించే సూత్రంబొకటే!
సూత్రంబొకటే!

సూత్రపు చివరలు సుఖముగ కలిసీ
చిత్ర తంతువై స్నిగ్ధపాశమై
ఇష్ట గ్రంథిని ఏకంబయ్యే సూత్రంబొకటే!
సూత్రంబొకటే!!

(అందరును ఆలకింతురు)

శ్రావణ : అదే నవనీతుని కామకంఠం! నవరసాలు పితుకుతున్నది. ప్రస్తుత పంకంలోనుంచి అప్రస్తుత పద్మంలో రసీభవిస్తున్నది. బహుశః సభకు పోతున్నాడు. (విభవైపుమళి) తల్లీ! నేను వెళ్ళెదునా! (నోరు చేతితో ఒత్తుకొని) కాదు, కాదు-మనము వెళ్ళెదమురా!

విభ : కుమారా! నీవు కుశీలవ గోష్ఠికి పొమ్ము. మరులు కొన్న లేగను నిరోధింపకూడదు; నేను వెళ్లగలను. (సుగంధి వకుళలనుచూచి) ముదితలారా! కృతాభీష్ట ముదితలై ఉల్లసిల్లుడు!

(ఇరువురును నమస్కరింతురు. విభాశ్రావణులు నిష్క్రమింతురు)

వకుళ : అక్కయ్యా! చిత్తచంద్రికకు మబ్బుదాటితే కొండనెత్తము అడ్డమైనది. కానిమ్ము; నా నాథుడు వెళ్లు తున్నాడు. నేనునూ ఇల్లు చేరెదను. ఈ సాయంత్రం నీవు వస్తావుకాదూ...

సుగంధి : అలాగే! (వకుళభుజముపై చేయివైచును)

(తెర వ్రాలును)

## ఏడవ రంగము

### ముకుళ నికేతనం : కుశీలవుల కలాపము

గోడలమీద చిత్రములు, త్రిపర్ణలేఖనములు. తివాచీలు పఱచి యున్నవి. వాటు కఱపని పున్నాగపూలదండలు. పిడికిలి పట్టని పొగడ పూలమాలలు. ఉచితస్థానములలో రంగుదిండ్లమీద వీణె, మృదంగం, తంబూరా. కడిమిచిగుళ్లు, మామిడిచిగుళ్లు సంమిశ్రితంగా కట్టిన తోరణాలు ద్వారములకు. వాకిలి కిరుప్రక్కల పెద్దపెద్ద అరటిస్తంభాలు, కొబ్బరి ఆకులతో తీర్చిన కమాన్లు. తెలుపుపూసి ఎఱుపురేకలు దిద్దిన మంటిబానలు, ఇరువైపుల అందందు శుద్ధోదకములతో నిండి ఉన్నవి. మొగసాలముందు రెండు సంవత్సరములగు ఆవులు, వాని మెడలనానుకొని ఇరువురు యాదవ బాలురు వేణు వూదుతున్నారు.

సుందరుడు, పరంజ్యోతి, సుభాషి ఆసీనులై మఱికొందఱు నాగరకులు అర్ధవలయంగా కూర్చున్నారు.

(తెరలో)

స్నేహపూరంబుతో ప్రకాశించి మించె
మానవులు నిల్పికొన్న సమాజ దీప
మది, చెదరి, చింది, పంకిలమయిన, సకల
హీనమగుగాదె ఇండ్ల వాకిండ్ల వరుస!

(అందఱును ఆకర్షితులై ఆవైపు చూపులు సారించి విందురు)

సుభాషి : నవనీతుని కంఠం! ఇటీవలి కటకటలలో అతని స్వరము అలసాలసమై, అంతః క్షుంభితమైపోయింది. తిరిగీ. నేడే సుముఖోన్ముక్తంగా వినవచ్చింది.

సుందర : స్తనిత కంపిత కాతరమైన వాతావరణములో వెదురుపొద మొలకరింపదా!

పరం : స్తన్య పిపాసతోకాని శిశువుకంఠం శ్రుతికాదేమో?

సుభాషి : అవును. రెండు ఉపమానాలూ చక్కగా కుదిరినవి. కన్నెహస్తాలకు గుత్తంగా తొడిగిన వన్నె గాజుల లాగా. కాని, గీతంలో ఏదో కలకండముక్కవంటి చవి స్ఫురిస్తున్నదోయ్.

సుందర : కలకండలో తీపి ఎంత తిన్నగా చర్వణమయితే, అంత చిక్కగా లోపలికి జాఱుతుంది గదా?

(నవనీతం గీతముచదువుతూ ప్రవేశం)

అది చెదరి చింది పంకిలమయిన సకల
హీనమగుగాదె ఇండ్ల వాకిండ్ల వరుస

పరం : అది...ఏదో అది? పూర్వార్థముకూడా మళ్లీ చదువు...

సుభాషి : స్నేహపూరంతో ప్రకాశించి మించె ఇంత వఱకు నేను పట్టుకొన్నానోయ్.

నవనీత : వినేవారుంటే...చదవడానికేమిరా(అని, చదువును)

స్నేహపూరంబుతో ప్రకాశించి మించె
మానవులు నిల్పికొన్న సమాజదీప,
మది చెదరి చింది పంకిలమయిన సకల
హీనమగుగాదె ఇండ్ల వాకిండ్ల వరుస

సుందర : సుభాషి అన్నట్లు ఏదో సుగంధం తరళతరళంగా తగులుతున్నది.

పరం: అవునోయ్. సంపంగిపొద సమీపించినట్లున్నది. సుభాషీ! గుప్తములను గమనించడానికీ, సుప్తములను లేప డానికీ నీవే చాలిన చతురముఖుడవు.

సుందర: చతురముఖుడంటే అతిశయోక్తి భయమున్నదా?

పరం: అతిశయోక్తి భయంలేదుగాని, అనౌచితీ భయం లేకపోలేదు. ఎందుచేతనంటే, బ్రహ్మదేవుడనంగానే ఎదుగూ, పొదుగూలేని వృద్ధచ్ఛాందసుడు ధ్వనిస్తాడు. పైగా, ఆయన నాలుగుముఖాలతో ప్రవచించినది ఒక్కటే శ్రుతి. అది గూడా ఎప్పుడో ఒక్కమాటు పలికాడు. దానినే యుగాల తరబడి, అహరహము అధ్యయనం చేయమని శాసిస్తాడు.

సుందర: అయితే, సుభాషీ! కానిమ్మ. నేటి మన కలా పానికి ఇదే గోష్ఠి అవుతుంది. నవనీతుని గీతపదకి నీ సుభాషిత మును వివరించు.

సుభాషి: నవనీతం! కూర్చోవోయ్ (అతడు ఆసీనుడగును) విన్నాణ మెంత ఉన్నా వెన్నముద్దలో పూసలు ఏరి తీయడం సాధ్యము కాదు.

పరం: శ్వేతారణ్యములో చంద్రికాచయనం చేయ గలవు. అవివక్షితము లేవైనా వివక్షితములు కావాలంటే అవి నీ వాక్కుకే చిక్కుతవి.

సుందర: శిల్పికి శిలానిద్ర తెలియు లేదంటే నమ్మ్ముతారా!

సుభాషి: భవతు. మిత్రవశ్యంకాని మనీష ఉండదు కాబోలు. చూడండి: స్నేహంతో గీతానికి శ్రీకారం

పెట్టాడు. ఈ స్నేహపదం స్నేహములాగా ఆశిరశ్చర ణాంతమూ పద్యాన్ని స్నిగ్ధము చేసివేసింది ముందుగానే. అందువల్ల పట్టుచిక్కదు. జిహ్వామీద చిందిన జిడ్డుతేనె తీరుగా లోనికే జారిపోతున్నది. సృష్టి ఆదినుంచీ మానవసంతతి సలిపిన అనంతప్రయత్నకాండలో దీపారాధనసిద్ధి మహత్తర మైనది. పద్యములో ఆదీపము సమాజంగా నిరూపితము. కాగా, ఇంటిలో చీకటి దీపకాంతితో అపహృతమైనట్లు, దేశంలో, జాతిలో కమ్ముకొన్న మూఢచేతనము సమాజ ప్రకాశముతో అపహతం కావాలె. దీపానికి తైలములాగా సమాజమునకు స్నేహము పోషకమని భావము.

పరం : ఇల్లు శోభిల్లడానికి దీపమూ, జీవితము శ్రేయ మానం కావడానికి స్నేహమూ మూలములు. ఇటు దీపానికి తైలమునూ, అటు సమాజానికి స్నేహమునూ ఆధారములు. అంతేనా ?

సుభాషి : అవును. తరువాత పరికించు. తైలము తొణికి, తెర్లి, మడ్డిగట్టితే దీపం వెలుగుతుందా ? తథా: స్నేహం విఱిగి, విక్షిప్తమై, పాపిష్ఠమయితే సమాజం సంభావనీయ మవుతుందా ?

సుందర : దీపం దేబెరిస్తుంది. అలాగే, సమాజం చాకల రేవు అవుతుంది.

సుభాషి : ఆ దుర్దశలో, ఆదైన్యపాతంలో, దిక్కుమొగ ములై ఇండ్లూ, వాకిండ్లూ, వావివరుసలూ శోభా దరిద్రాణ ములై సురిగిపోతవి.

పరం : ఇండ్లు గుర్తుపట్టినా, ముఖద్వారమేదో, దొడ్డి వాకి లేదో విచక్షించడం కష్టమే కావచ్చు.

సుందర : ద్వారాలు తడవగలిగినా? పడకటిల్లేదో, పాక శాలయేదో లక్షింపలేని ప్రమాదం రావచ్చు.

సుభాషి : సుందరం! సెబాస్. నీ రూపువలెనే చూపు కూడా సమంత సుందరమురా? అది జన్మాంతర సహృదయ వాసన.

(తెరలో)

సహస్రపరమా! దేవీ! శతమూలా! శతాంకురా!
కరోతి రసరమ్యాంకమ్, విశ్వమ్ కవి విపంచికా!

సుందర : అహో! భగవతి భామతి, ఇటే వస్తునట్లున్నది.

(అందఱును అవధానంతో ఆలకింతురు)

సుభాషి : ఆ మహోపాధ్యాయిని ఆహ్వానించడం కుశీలవుల కందఱికీ అభిలాషితం.

(అందఱును లేతురు. భామతి ప్రవేశించును)

సుందర : దేవీ! వినీతభాగులు, కుశీలవకుమారులు, నీ కిదే ప్రణమిల్లుచున్నారు.

(అందఱును సాష్టాంగవతులగుదురు)

భామతి : ఇష్టార్థ సిద్ధిరస్తు. మాధుర్వ్రతుల కందఱికీ మా కుశలాశ్వాసములు.

సుందర : మాతే! మీరాక ఈ కుశీలవుల కందఱికీ మంగళపర్వముగా ఉన్నది.

భామతి : కుమారా ! కుశీలవులు కువలయ ప్రియులుగదా. అందువలన రాకలన్నీ వారికి ఉత్సవప్రాయములే అగును.

పరం : తల్లీ ! ఇదే సుముఖాసనము. వేంచేయండి.

భామతి : (ఆసన మలంకరించి) సుభాషీ ! ఏదో కలాపము జరుగుతున్నదే. ఆపివేసితివి. అంతరాయమును ఉపేక్షించి ఉపక్రమించు.

పరం : భద్రముఖి ! నవనీతం నవీనంగా ఒక పద్యము వ్రాసాడు. దానిలోనిభావమును పాడి, బానలో జున్నుబాల లాగా మథిస్తున్నాము.

భామతి : దధిమథనములోకూడా కర్మ సుకౌశలం ఉన్నది. భాండము భద్రం. ఏదీ! అది చదువగలవా!

పరం : వినండి :

స్నేహపూరంబుతో ప్రకాశించి మించె
మానవులు పెట్టుకొన్న సమాజదీప
మది చెదరి చింది పంకిలమయిన సకల
హీనమగుగాదె ఇండ్ల వాకిండ్ల వరుస.

భామతి : సాధు ! సాధు !! 'సకల హీనమగుగాదె ఇండ్ల వాకిండ్ల వరుస' (అని అనుదాత్తస్వరంతో చదువును)

సుందర : సుభాషీ ! శేషం పూరిస్తావా ?

సుభాషి : గురుచారిణీ ! అనుజ్ఞా. . .

భామతి : వత్సా ! ఉపక్రమించు. వినుట కపేక్షించు చున్నాను.

సుభాషి : ఇండ్లవరుసా, వాకిండ్లవరుసా రెండూ భ్రష్టములై, నిస్తేజసములూ, నికృష్టములూ అయి మాసిపోతవి. అంటే, గృహస్థులయిన ప్రజలు అన్యోన్యానురక్తులుగాక, ఎవరికివారు విడిపోగా, వంశధార తెగుతుంది. ఇక, వాకులకు ఇండ్లైనశబ్దాలుకూడా పరస్పరాన్వయ బంధములుగాక శిథిల క్రమములైతే, అవి అపార్థకములో, అనర్థకములో అవును. ఒకదానితో నొకటి సుబద్ధముగాని అసిపంజరములో ప్రాణ ప్రతిష్ఠ కుదరదు. అల్లాగే పరస్పరార్థవర్ధనములుగాని శబ్దముల వరుసలో స్థాయిభావము సంపన్నము కాదు.

సుందర : స్నేహపదావరణమును ఎంతదూరం విస్తరించావురా ?

పరం : స్నేహమయమైన రచనలో పట్టు జాఱుతుందని మొదటనే చెప్పాడు. లేకపోతే, సుభాషిత తరంగము ఏ భంగిలో పొంగి, పొర్లి, ఏ దూరభాగాలుతాకేదో, ఏపచ్చపాదులను తడిపేదో.

భామతి: మీపట్ల కుశీలవాభిధానము ధన్యమయింది. ఇలాటిగోష్ఠిలోనా మీ తరుణము గడుస్తున్నది? ఎంతో సంతోషం మాదృశులకు. సరేగాని, నవనీతపదంలో నాకు అర్థాంతరము స్ఫురిస్తున్నదే! చెప్పుదునా ?

అందఱును : (ఏకకంఠముతో) శ్రేయస్వినీ! వచింపుము ; వచింపుము. శ్రద్ధాబుద్ధులమై ఉన్నాము.

భామతి: 'ఇండ్లవాకిండ్లవరుస'–ఈపంక్తిలో విశ్వజనీనమైన అనుభూతి ఒకటి అందుతున్నది. దానిని ఇలా భావించాలె.

ఇల్లంటే పుట్టినయిల్లు, వాకిలి అత్తవారింటికి స్థానీయం-ఉపలక్షకం. పుట్టినయిల్లూ, మెట్టినవాకిలీ అని జనశ్రుతి. శబ్ద సిద్ధికి లోకమే మూలము. వైపశ్చితియైన వాశిలో, రత్న మాలలో నారపోగులాగా అది అపహ్నవ మవుతుంది. ఎప్పు డునూ శబ్దసంకేతము లోకంలోనే, జీవితంలోనే, నిత్యవ్యాపా రంలోనే సమర్థమై స్పష్టమవుతుంది. అర్థానువృత్తినికూడా అనుభవముమీదనే సాధించాలె. చూడండి: ప్రసూతి గృహా భ్యంతరములో జరుగుతుంది. ప్రవేశము గృహముఖద్వారాన జరుగుతుంది. ఒకచోట పుట్టడం; మఱొకచోట ప్రవేశించడం. ఇంక వరుస అంటే: సంబంధబాంధవ్యక్రమము; వంకరలేని చాలు. జనవాణిలో వావివరుస లనేమాట వాడుకలో ఉన్నది గదా? కాగా, 'ఇండ్లవాకిండ్లవరుసలో' ఇచ్చిపుచ్చుకునే స్త్రీ పురుష బాంధవక్రమము ధ్వనిస్తున్నది. ప్రజాసమాజమునందు అన్యోన్యసంబంధములలో ఇచ్చి పుచ్చుకొనుబంధము ప్రధాన మైనది. ఎందుచేతనంటే, అది రక్తానురక్తము; సంనిహితా సక్తము. కాబట్టి, వావివరుసలు క్రమబద్ధము లైనవి. ఇలా సక్రమంగా నడిచి, చక్కగా కూడిన జనగణమే సమాజము. ఈ విన్యాసములో స్నేహభావము చెదిరి, చింది, పంకిలమైతే, వావివరుసలు వ్యత్యస్తములై, వివిధములై, వికృతములై పోతవి. సమాజతేజస్సు తీసిపోతుంది. సత్వసౌష్ట వములు సన్నగిల్లుతవి. సుభాషీ! పద్యవ్యంజనలో నారీ నర వృత్తము మిత్తగా అవివక్షితమయిందని నాభావన.

(అందఱును ఆలోచనాపగ్ను లగుదురు)

సుభాషి : ద్వాపరభారతీ! విశ్వతోముఖపశ్యంతి యగు నీ విశుద్ధబుద్ధికి నమోవాకము.

పరం : సుభాషివ్యాఖ్య ఆవరణచ్ఛేదం చేస్తూపోతుంటే ఉత్తరోత్తర కక్ష్యలెన్నో యెక్కితిమి. కాని, ఏదో అందీ అందని చందమామ పాలగిన్నెలాగా మనస్సును లాగుతూనే ఉంది. దేవీ దివ్యలోచనలో అది అగుపించింది. అంతేకాదు. అనుప్రసక్తంగా తరుణవాసనకూడా సంమిళితం కావడము విశేషం.

సుందర : తల్లీ! నారీ నయ వినయసూత్రములు నేడు క్లిష్టములై కుటిలగ్రంథులుగా కఠినములైనవి. చాయకూ, చక్కనకూ, తీపికీ, తీర్పుకూ ఆటపట్టులని వేటిని భ్రమించామో, అవి అన్నీ, మృగతృష్ణలోని మిథ్యారంజనములవలె అనాశ్వాసితములుగా మాఱినవి. ఆ యమృతశోభలుకూడా అనృత మరీచకలలాగా తేలితేలి పోతున్నవి. ఏతత్ప్రసంగము నెత్తి సుప్తకల్పంగా ఉన్న మాదృశుల మనోవేదనను మఱల లేపితివి. ఏదిగతి? గమ్యమెక్కడ? (అని స్తబ్ధకంఠముతో—)

భామతి : కుమారా! నారీప్రసంగము నీకెట్లు ఆందోళన ప్రసక్తమయిందీ! రాగములో పల్లవిత మయ్యేసరికి శ్రుతిశ్రీకి సప్తస్వర కుమారోదయమే సంభవించింది. కుమారీ సంపత్తి కాలేదు.

సుభాషి : అదెట్లు?

భామతి : స్వరసంమేళనమే రాగము. శ్రుతి సుబద్ధంగా ఆ రాగము అనువర్తనమైతేనే పల్లవితమే. షలరస స్వరూ

పంగా పరిణత మవుతుంది. అల్లాగే, రాగముకూడా సతీసహ చరంగా పురుషార్థమయితేనే ప్రఫుల్లప్రేమగా విపాక మందు తుంది. ఇది సృష్టిలో సహజమూ, సంపూర్ణమూ అయిన ప్రాణి విన్యాసము. ఏతద్విరుద్ధమంతా చైతన్యవిరుద్ధంగానే విశ్వసించాలె.

సుభాషి : అశ్రుతం! అపూర్వం! ధన్యులము!

సుందర : భగవతీ! సతీచక్రము అపసవ్యంగా తిరిగినప్పుడు గత్యంతర మేమి ?

భామతి : అనురాగీ! మిథున రథానికికూడా రెండు చక్రాలు. అది జీవిత రథ్యలో గమించి యాత్రా లక్ష్యమును చేరాలె. ఎక్కడెక్కడ జీవితచర్య ఉభయావృత్తిగా నున్నదో అక్కడనే ఈ సవ్యాపసవ్య విధికి వినియోగము.

సుందర : ఉభయావృత్తిలో పూర్వోత్తర క్రమమేమీ లేదా ?

భామతి : లేకేమి? కర్తృత్వము పురుషునిది. అతడే ముందంజ వేయాలె. స్త్రీ అతనిని అనుగమిస్తుంది. కాని . . . ఇందులో ఒక్క భ్రమ ఉన్నది. పురుషుడు అపసవ్యంగా నడిచినప్పుడు సవ్యంగావచ్చే స్త్రీ ప్రత్యఙ్ముఖి అయినట్లే కన బడుతుంది. ఆ విషయ ప్రకరణంలో స్త్రీ చక్రం వక్రించి దన వచ్చునా ?

సుందర (సాలోచనావస్థ నభినయించును)

పరం : మిత్రకంఠీ! నేటి నీప్రసంగము మమ్ము అంతశ్శోధ నకు ప్రకోపిస్తున్నది. మేము హృదయ వాదులము. మానుష

సంక్రాంతిని ఆభరణ లక్ష్యంగా పెట్టికొని, మధుర యాత్రకు బయలు దేరితిమి. కా-ని-మా గతి గమనభంగిలో ఒదు దుడుకులునూ, ఉద్రిక్త ఉద్విగ్నములునూ మాకు తెలియడం లేదు.

భామతి : తెలియకపోవడం సహజమే. మీ నవ సంక్రాంతిని మానవ సంక్రాంతి కావలెననికూడా భావించుచున్నాము. అందువల్లనే మీ జిజ్ఞాసను, మీమాంసను పరోక్షంగా పలువురు పరీక్షిస్తున్నారు.. నేనుకూడా అనాక్షేపకంగా, ఆసక్తితో పరిశీలిస్తున్నాను. నేడు మీ కలాపమునకు రావడానికికూడా అదే కారణం.

సుందర : ధన్యులము. నేటి కలవరమునుచూచి, మా కుశీలవకులము బహిష్కృతమయి పోయిందేమో అని భయపడితిమి.

పరం : ఎప్పుడూ నా కాభయం తగలలేదు. కాని, లోకులు —వారిలో వివేకులు, మాసాధనపట్ల ఏ చూపుతోనున్నారో తెలుసుకోవలెననే ఆవేదన లేకపోలేదు. అందుకోసమే ఈ అలూతూ రక్షికను అరమర లేకుండా అడిగితిని.

సుభాషి : శిక్షాకరీ! మాలోపములు మాకు తెలియకపోవడం సహజమే యని వాక్రుచ్చితివి. ఆ ప్రకరణమును ఇంచుక విస్తరించితే కృతార్థుల మాదుము. ఎందుకంటే, నేటి కాంతా కలకలంలో మా ప్రసక్తి వస్తున్నది.

భామతి : వత్సా! ఇతర సాక్ష్యములెందుకూ. నవనీతుని పద్యమే 'ఉత్తిష్ఠ! జాగ్రత' అని ధ్వనిస్తున్నదిగదా?

సుభాషి : అయితే, కుశీలవులసాధన కితవంగా, కుత్సితంగా అపక్రమిస్తున్నదని నీ అభిప్రాయమా ?

భామతీ : అసలు మీసాధనే కళావర్తము. కళలన్నీ కాంతాధిష్ఠితములుగదా ! అందువలన ఆ సాధనచారలో, అతిచార, అభిచార సంపర్కమునకు అత్యంత దుర్లలితమైన అవకాశమున్నది. ఆ విషమోపలాలనమే నవనీతపద్యమందు జాగ్రదవ బోధకంగా అనురణించుచున్నది.

సుందర : బ్రహ్మవాసినీ ! ప్రసక్తాంశము ప్రణయతంత్రీ జాలములో చిక్కుకొనేటట్లున్నది.

భామతి : ప్రణయమంటే భయమెందుకు ?

సుభాషి : మాతృ సమక్షములో ఆస్థాన కృతమగునని భయం.

భామతి : పుత్రదోషం పొడకట్టని స్థానము ఒక్క మాతృ నేత్రము మాత్రమే. దీని నెఱుగుదు రనుకొందును. మేము ప్రణవ పాలికలము. భయ సంశయములు మా యావరణ లోనికి రావు ; రాజాలవు.

సుందర : (తనలో) ఆహా, స్త్రీ వ్యక్తిరత్నాకర మెంత అగాధంగా ఉన్నది. (ప్రకాశంగా) దేవీ ! క్షమించుము. ప్రేమ శ్రుతి భాష్యం వినగోరి వినతుల మగుచున్నాము.

భామతి : కుమారులారా ! శబ్ద బ్రహ్మాండములో అవచనీయత ఎక్కడ ఉన్నదీ ! ప్రణవమూ, ప్రణయమూ, ఈ రెండునూ యోగుల సాధనలోనివే. శారీరకంగా సంయ

మనములో అనుతప్తమైన ఇంద్రియచాలనం ప్రణయ రూప మును పొందింది. ఇంద్రియాతపములో ఉన్ముక్తమైన విషయ సహస్రార స్పందనం ప్రణవరుచిగా భాసించింది. ఒకటి అంగ జాతము, రెండవది భావభూతము.

సుభాషి : అయితే, ప్రణయమునకు భావభూత ప్రతిపత్తి లేదని నిశ్చయమా ?

భామతి : లేకేమి ? ఉన్నది. తేనెత్రాగి, దానిలోని తీపిని అనుభవించే ప్రసాదనం ప్రణయసరణి. ఈ కలాపములో ఇంద్రియానుభోగం తప్పదు. గీతినాలించి తన్మాధుర్యము ననుభవించడం ప్రణవపథము. ఈ ఉపాసనలో అంతరనుశీలనం మాత్రమే సంగతం.

సుభాషి : తల్లీ ! ఈ వివేచనా దర్పణం చూస్తే, ప్రణయ పక్షమే సహజమూ, సంపూర్ణమూ అని ద్యోతమవుతున్నది. పైగా, కళాస్ఫోట మండలములో రసావతరణ మవుతున్న మధుభూమిక అందే గోచరించుచున్నది.

భామతి : సుభాషీ! చక్కగా అందుకొన్నావు. కాగా. మీ కుశీలవుల లక్ష్యము మధుభూమికనే అంటి ఉన్నది.

పరం : 'కరోతి రసరమ్యాంకమ్, విశ్వమ్ కవి విపంచికా।' (అని చదివి) ఓహో! ఈ శివార్ధ సీమంతముదాకా మా దృష్టిపోలేదు. పదమంజీర శృంగారంలో ఫణితి శింజానమును గమనింపక పోతిమి.

సుందర : అవునోయ్. విచ్చీవిచ్చని శుకశాబక పక్షములు విదిల్చినట్లు ఏదో ధ్వని వినబడ్డది. కాని...

భామతి : సుందరా ! నిజము. మేము శుకశాబకులమే. మాపక్షము లింకా అర్థోన్మత్తములుగానే ఉన్నవి.

సుభాషి : సుందరుని పరామర్శ ఎప్పుడునూ కప్పురము గుప్పుతునే ఉంటుంది. ప్రియవాదినీ! వింటివిగదా! మీ రందఱూ శుకశాబకములైతే మేమందఱము పికశాబకులము కావాలె. ఆమీద శుకపిక సంతానమునకు బాంధవమెట్టిదో గుర్తించాలె.

భామతి : అది గుర్తింపవచ్చు. భాగవత రామాయణ ముల అవాంతర వాల్లభ్యమును మీరెట్లు భావిస్తున్నారో ముందు తెలిసికోవాలె.

సుభాషి : వసంత శరదృతువుల అంతరము వంటిదో, పరి మళ సౌరభముల భేదమువంటిదో అనుకొందుము.

భామతి : బాగు! సుభగభాషీ! బాగు! పాయస పయ స్సులలో పాకపచన పరిణామమును ఆకళింప గలిగితివి.

సుందర : భట్టారికా ! మీ రిరువురును ప్రౌఢమాలాకరణం ప్రారంభించారు. అందులో కమలములేవో, కుముదములేవో యేర్పడడం లేదు. వానిలోని తారతమ్యం అసలే అబోధం. మేము గుర్తింపగలమా? ముచ్చటలతో ముత్యాలలోని మిసిమి మీదికి తీస్తున్నారు మీరు. లావణ్యమును వడపోసే దేలాగో తెలియడం లేదు నాకు.

సుభాషి : నీవు సౌందర్యమును జల్లెడ పట్టినట్లే...

పరం : ముండ్లదానిమ్మమీద శుకశాబకములు, తీయ మామిడిపైన పికశాబకములు. వారికి ఫలచ్ఛేదం; వీరికి పల్లవ

గ్రసనం. ఒకచోట విరక్తిబోధ; మఱొకచోట అనురక్తి బాధ. ఈ రెంటిలో సాధర్మ్యం కానరాదు. పైగా, విరోధమే ఉన్నదేమో! నాబుద్ధికి మీమాంస క్లిష్ట విపర్యయమైనట్లు తోస్తున్నది. గురుదేవతలముందు గుసగుస లెందుకు? భాగవత భగినీ! అవినయమని భావింపకు. రామాయణ భాగవతాల అంతరం స్పష్టము కాలేదు.

భామతి : జ్యోతీ! జ్యోతిర్మయమైన వాఙ్మయమును అమృత కలగాను, రమ్యాక్షర సంహితంగాను విచక్షించాలె. రామాయణముతో కావ్యావతరణ మయింది. అందులో కథ రామునిది. దివ్యావతరణికయైన వీరి దంపతీ ప్రవృత్తి లోకంలో శ్లోకబద్ధంగా రూపొందింది. ఈ కరుణ కలాపమే వాల్మీకికోకిల కంఠాలాపమై, జగన్మనోరమంగా వివర్తించింది. అదే రామాయణము.

సుభాషి : అంటే, సుఖదుఃఖ క్షుభితమైన ప్రాణివ్యాపారము మహాకవిముఖ మధుమయమైతే మానుషీ మనోమంగల్యమగు కావ్యంగా అవతరిస్తుంది. అంతేనా ?

భామతి : అవును.

సుందర : కాగా, కావ్యం ఒకానొక భణితి వైచిత్రియని తేలింది.

భామతి : కాదు. అది కావ్యస్ఫూర్తిని అపకర్షించినట్లవుతుంది. కావ్యవాక్కు కాంతాసంమిళితమై, నవ్యాంజనచే కళ్యాణ సేచనం చేస్తుంది.

సుభాషి: అప్పుడు వేదశాస్త్రాదికమైన వాక్యకంటె కావ్యవాక్యను విలక్షించినట్లు కాదా?

భామతి: స్పష్టంగా కావ్యపద పథములు విలక్షణములే. బ్రాహ్మిమైనవాక్కు ధర్మవతిగా, అర్థవతిగా, కామవతిగా విజ్ఞాన రచనను అనువర్తించింది. ధర్మవతిగా లోకకర్మాను శాసనమును, అర్థవతిగా నిక్షేప సంగ్రహమును, కామవతిగా కళాక్రతువును నెఱపి నిర్విహిస్తుంది.

సుభాషి: అయితే, ప్రాచేతసుని వాక్కు రామాయణ కావ్యంలో కామ వ్యాపారవతిగా ప్రసరించిందని అనుమిత మయింది ఇంక కథలోనున్న కళావిశేషమేమి?

భామతి: కావ్యంలో కథకూడా నిర్వికల్ప మిథున యోగంలోని సర్గ కామ విపాకము పొందాలె. అదే ఆత్మ కలాకోశ సమున్మీలనం.

సుందర: జ్యోతీ! విను. కావ్యకథ కామవిపాకం పొందాలె. అనగా, రామాయణములో కామ సమాధి లగ్నమయిన కథ సుబద్ధమైనదని తేలింది.

సుభాషి: దేవీ! నీవాగ్దర్శనంలో నేడు మాకొక అనంత ప్రతీతి భాసించింది. ఇది అపూర్వం; అశ్రుతం. మంగళ్యమూ, మనోరమమూ అయిన ఆ రామాయణ హృదయమును ఉప దేశిస్తే కుశలవులు కుశల శీలురగుదురు.

సుందర: దాన్ని పృథివీ కుహరంలో జీవరత్నంలాగా, క్షీరాబ్ధిలో చంద్రజన్మ స్థానంలాగా వెదకితే—కాని...

పరం: పూర్వం మహర్షులు పరమాత్మకోసం వెదకితే, గాయత్రిలో వరేణ్యంలాగా, హృదయపద్మ కోశాగ్రమందు చిక్కలేదా ?

భామతి: మాధురీ కుమారులారా! షట్పదీ గేయానికి ప్రసవించే లతలాగా మీ అభీకయాచన నన్ను సర్వోన్ముక్తను చేస్తున్నది.

పరం: లతికామ తల్లులు మాధుకరులకు మకరంద స్తన్యమిచ్చినట్లే...

సుభాషి: మాతామతల్లి మాకు అమృత రసప్రదానము చేయకపోదు.

భామతి: సుందరుని సుభాషితంలో సున్నితమైన ఉపశ్రుతి తగిలింది నాకు. మీరెవ్వరూ సందేహించ లేదా ?

సుభాషి: సందేహానికి సందుఉంటే ఉపశ్రుతికూడా అలంకారమే అవుతుందిగా.

భామతి: నీ ఊహా ఛాయాను ధావనమని నేను అనను. కాని, జంత్రవాద్యంలో సాహిత్యపదాలుకూడా స్వరరూపమునే చెందినట్లు నీ మనోరాగంలో రక్తమయి పోయింది నాపలుకు. అవును. రామాయణములో సీతారాముల మిథున కామము విపాకమును పొందింది. అందువల్లనే, మునికంఠాన స్యందించిన సుందరకాండ అమృత భాండమైనది. దంపతీ ధౌతమయిన ఆ కామం త్రివర్గ పరిణద్ధమైన శుద్ధకామం. అది అవ్యభిచారి. సృష్టిలో ఈ దివ్యాంశ నిగీర్ణమై సార్వత్రికంగా ఉన్నది.

పరం : కామముకూడా దివ్యాంశ అని భగవతి భావమా?

భామతి : ప్రకృతిపురుషుల బ్రహ్మాండ లీలయే కామం. ఏతన్మహామధుర యోగ స్థాయియే రతి. జన్య జనకమైన ఐశ్వర్యంలాగా ఆ మహారతి సమస్త చరాచర జగత్తునకునూ అవిభాజ్య భాగధేయంలాగా సంక్రమించింది.

సుందర : అలాగయితే, స్థాణువులలో సైతం రతికలదా?

భామతి : అవును, పాషాణాదులయందును రతికలదు. జాతి గుణ క్రియా వికల సంకులత్వబద్ధములైన ఉపాధులయందు ఆ రతి ముహ్యమై, మూఢమై, శుష్కించి సాకల్యంగా జడీభవిస్తుంది. ఇల్లా ఘనీభవించిన మహారతి ఖండములు యాదృచ్ఛికంగా శిల్పిశిల్ప విన్యస్తములై జీవత్ప్రతిమలుగా అక్షయ చాక్షుషము లగుట కలదు. యావచ్చేతనమునూ ద్రవీకరింప సమర్థమగు గాంధర్వ మహిమచేతనూ ఆ పాషాణములు పులకించి కరిగి కందళించుట విందుము. రూపాంతర సుప్తకల్పమైన ఈ రామణీయకము కవులకును, కళావేత్తలకును వేద్యము.

సుభాషి : అహా బ్రహ్మసూత్రాలకంటెనూ చైతన్య సూత్రాలు దూరదూరాంతర గుహ్యములుగా ఉన్నవి. విద్యా జీవనాడులను నిదానించిన భగవతివి...

పరం : మానవులలో ఈ కామవ్యవస్థాపనమును సమన్వయిస్తే తెలిసికొని తీర్పరులము కాగోరుదుము.

భామతి : జ్యోతీ! సామాన్యజంతుసంతానమునందు రతి అంతటను ఋజు ఋతూద్దీపన లక్షితంగా ఉన్నది. పుష్పిత

బుద్ధింద్రియులైన మానవులలో అది స్త్రీ పుంసయోగమై అలౌకిక సుఖానుభూతి నందింపగల సత్యాంశగా సిద్ధిపొందింది. కాని, చిరచిరంతనంగా నిరంతరనిపాతంచేత మానవులలోని కామము సామాన్య మిథునభోగంగా జాతింది. పైగా, ఈ అతిచారము ఆచారప్రాయంగా పెనబడిపోయింది. ఇది సుమానుషప్రాప్తికి ప్రళయమైన ఆపత్తి. దీనివలన త్రివర్గ లక్ష్యమే క్షిప్రమై, క్షతమై, సామాజికి సౌష్టవము నికృష్టం కాసాగింది.

సుందర : అదెట్లు ?

పరం : స్పష్టమేగదా? పంచమంలో శ్రుతి నిలిపి, మంద్ర మధ్యమాలలో రాగసంచారము సలిపితే యేమవుతుందీ ?

సుందర : నేను అల్లా భావించడంలేదు. ఒక్క సూత్రం అనేకమణిధారణంచేసి హారసిద్ధి కావిస్తున్నది. ఏకశబ్దం బహు వర్ణబంధమయ్యును సార్థమై సార్థకమవుతున్నది.

సుభాషి : హేతువాదంకూడా అస్థానహితం కాకూడదు సుమీ. అచేతనఘటనం ఇపుడు విషయం కాదు. అక్షర సంయోగం ఆధిభౌతికం. ఇప్పుడు మనం లోకంలో, మానవ సమాజంలో ఉన్నాము. అదే ప్రసక్తి. పైగా, అంతరింద్రియ వికస్వనులై నారీనరుల ప్రియబంధమును సంమర్శిస్తున్నాము. అందులో అవధీస్నిగ్ధమయిన వారి చిత్తగ్రంథిని విప్పుతున్నది భగవతి. కుశీలవులకు కావ్యానుశీలనం కామ్యం, కామితం కూడా. అయితే, భామతి నవోన్మీలనంలో, ఏకత్రాను రాగమే స్థాయిసంపన్నమవుతుందని తేలింది. ఏతద్విరోధ

మందు రసము అందదు. ఆనందానుసంధానం కాదు, అని అపూర్వంగా నిశ్చయించింది.

సుందర (సాలోచనా పరుడగును)

భామతి : సుందరం! రామాయణ పూర్వరంగము అతీవం క్లిష్టమైనది. మానవజీవితానికికూడా కఠోర గర్భధారణకు వలె కష్టమైన దుస్తరుణం. ప్రసూతమో, ఉత్పాతమో వీని సంధి. సమాజరథచక్రాలు అపగతి భ్రమణంలో తడబడి పెడతిరిగినవి. నడివయసు నడక, నట్టేటియొడ్డున బాట, కింద ప్రవాహం క్షుబ్ధమై, సుళ్లుతిరుగుతూ గుండములు త్రవ్వుక పోతున్నది. మీద, మిణుమిట్టలకోరగట్టు సళ్ళి, త్రుళ్ళి పగిలి బ్రద్దలై కూలుతున్నది. నరనారీశకటం శరవేగంతో పోతున్నది. ఆ అభిజిత్తులో స్నానానికి వచ్చాడు వాల్మీకి. ఆతని ముందు ఒక ఉత్తాలిసాలం. దానికొమ్మమీద కశ్చిత్ క్రౌంచ మిథునం కామమోహితమై అవధీపారవశ్యంలో ఏకైకస్థాయిలోఉన్నది. హఠాత్తుగా, అకస్మాత్తుగా కిరాతుని కఱకు శరము మృత్యుమృద్గరంవలె రివ్వునవచ్చి తాకింది. ఆ జంట అవశంగా అరటిమొగ్గవలె క్రిందపడ్డది. అద్వైతమైన జత ద్వైతమయింది. క్రౌంచి ఏ మహానందంలో నుండెనో అందులోనే నిశ్శాంతంగా నిద్రించింది. క్రౌంచము నిహత సహచరీ విరహకాతరమై, కంఠమెత్తి ఆక్రందించింది. సమస్తవాహినీ గర్భోదకమునూ, బలాత్కారంగా తనలోనికి లాగికొనే మహాసముద్రంలాగా ఆ శోకస్థాయి యావజ్జగదంతఃకరణ ప్రసారమును తనలోని కాకర్షించింది. ఆ కరుణ కరుణకై వల్యరతిలో రోదసి రోదించింది; ఆకాశము ఖేదించింది; పాతాళము

విషాదించింది; విశ్వమే కరిగిపోయింది. వాల్మీకి తన్మయుడైనాడు. అప్పుడు ఆ మహర్షి ముఖమండలమునుండి అప్రయత్నంగా శ్లోకము ఆవిర్భవించింది. ఆ నవ్యచ్ఛందస్సులు కాండలుకాండలుగా అఖండరమణీయమైన రామాయణంగా ఆకృతి వహించినవి.

(వినువారలందఱును సర్వాంగపులకితులై ఏదో ఒక అతీత మహత్తర సమాధిలో ఉన్నట్లుయిరి)

సుభాషి : తత్వదర్శికా! నేడు కుశీలవులు ధన్యులైనారు. వారి ప్రజ్ఞావాదంమీది ముసుగు జాఱింది. వారి మీమాంసలో ప్రచ్ఛన్నమేదో, ప్రసన్నమేదో ఇపుడు ఇంచుకించుక ద్యోతమయినది. ఇఁక!

పరం: సుభాషీ! మనము వివేచనావంచితులమైనాము. అంతేకాని, భ్రష్టులము కాలేదు. కుశీలవులు కుత్సితులు కారు. వారి కామోపాసన కాముకవ్యసనం కాదు; తద్దాస్యమూ కాదు. సుందరమైనదంతా సౌందర్యమే అనే నిరూపణలో ఆ భాస ఉన్నది. సుఖమునకునూ, సుఖభావమునకునూ గల అంతరం స్పష్టమైనది. ప్రత్యక్షఫల అనుభవము త్యక్తము కాగా స్యందించే పరోక్ష ఫలితానుభూతియందే మాధురీవాల్లభ్యం భాసిస్తుందని తేలింది. అయితే, ఆ మహారుచి మన్మండలానికి కళలు, కవాటములని విశ్వసించి, మనము అభిముఖులమైనాము. భామతీదర్శనంలోకూడా అపేక్షితమైన ఆ లక్ష్యముమాత్రం అనాక్షేపకంగానే నిలిచింది. అవునా?

భామతి : జ్యోతీ! నిస్సంశయంగా నిలిచింది.

సుభాషి : సరేకాని. దివ్యముఖీ! రామాయణమునందు ఏకపత్నీనురాగం సువ్యవస్థితమయినందుచేతనే విశ్వచేతన మాధురీకారియగు రసావతారము ప్రాప్తించినదని సిద్ధాంతమా ?

భామతీ : ఖండితంగా, నిస్సంశయంగా అదే సిద్ధాంతం. దశరథుడు అత్యంత ధీరనాయకుడైనా అతనిరాగము ఏకత్ర నిష్ఠం కాలేదు. పురుషులలో, అందు సుక్షత్రియులయిన రాజన్యులలో ఇది సదాచారమనీ, సత్సమ్మతమనీ సంప్రదాయంగా, సత్కులప్రమాణంగా బలిసిపోయింది. రామచంద్రుడీ ఆచారమును అరికట్టాడు. జీవితం సహజంగా, సంపూర్ణంగా సాఫల్య విపాకినికి కలుగుతున్న విక్షేపమును, విఘ్నమును అపాకరించాడు. అందువల్లనే సీతారాముల స్త్రీ పుంసయోగము అజరామరమైన అమృతప్రాప్యం అయింది, ఏతత్ చరితం కూడా బ్రహ్మభూయమైన రసస్థానీయంగా చిరస్థాయి కెక్కింది.

సుందర : బ్రహ్మరోచనీ! అయితే, ఈ ఏకపత్నీనురాగం పురుషపక్షమునమాత్రమే నిర్దిష్టమా... లేక...

భామతి : సుందరా! పరుషములే సరళములు కాదగినవి. సరళములు పరుషములు కావుగదా.

(తెరలో)

బంగరు తమ్ముల
పసుపు తోయముల
ధర్మాభిషేకంబు చేసేరు

పచ్చల పాన్పుల
అచ్చర లాడగ
నిశ్చలధ్యానంబు సలిపేరు

కల్పవృక్షాలలో
కామధేనువు పొంత
గాలితిని ప్రాణాలు నిలిపేరు

ఏసుఖము కాంక్షింతు
రెందుకో ఈతపసు
అడిగినా చెప్ప రీ ఆరామమందు

(అని పాడుచు శ్రావణుడు ప్రవేశించును అవికలంగా)

కుశలవులారా! భామతీమతల్లి ఇందున్నదా? (తనలో) అదిగో! సవత్సగోకులములో నందినిలాగా ప్రసన్నతస్మిత ముఖారవిందయై ఇందే ఉన్నది. తల్లీ! ఆత్రేయసగోత్రుడు, శ్రావణకుడు, కుమారశర్మ సాష్టాంగము అభివాదనము చేయుచున్నాడు.

భామతి : కుమారా! ఏమైన విశేషమున్నదా?

శ్రావణ : ఆ! విశేషములలో విశేషము, పరమవిశేషం. బ్రహ్మమానసపుత్రుడు, భక్తిసూత్ర భాగ్యవిధాత, మహతీ సహచరీ, చరణచారణచక్రవర్తి, మహర్షి నారదుడు కుంద కాసారమునకు వేంచేసిరి. మధురలోనున్న స్త్రీజనమంతా అక్కడ మూగింది. కుశీలవుల కెతిగింపమని. కాదు, పిలిచి రమ్మని ఆకాశవాణి, కాదుకాదు. సతీర్థులుచెప్పి, తప్పదంటే,

వచ్చాను. లేదులేదు. నాకే తోచింది. ఎవ్వరూ చెప్పలేదు. తప్పదని బలాత్కరింపనూ లేదు. తప్పుకాదుగదా అని నేనే తర్కించుకొన్నాను. ఒప్పిదమని ఉబలాటం ఆపలేక, నా యిష్టంమీదనే వచ్చాను. మీరంతా బయలుదేరండి. వస్తారా! రారూ! నారదమహర్షిని చూడడానికి రారూ! వస్తారా! మహతీ వీణాతంత్రీ స్వరతంత్రము వినాడానికి రారూ!!

(తెర వ్రాలును)

## ఎనిమిదవ రంగము

### కుందకాసారం

కదంబ వృక్షములు, పున్నాగ వీధులు, పొగడ చెట్లు, మాలతీ కుంజములు, మల్లెమళ్లు . . . నారద మహర్షి కార్తీక మంటపమున పచ్చని వేదికపై ఆసీనుడై ఉండును. మధురాపురీ నారీజనం అధికంగా మూగి యుందురు. శ్రావణకుని చేతిలో తాళములు, సునందుని చేతులో మహతి ఉండును

నారద : నందా ! మహతి శ్రుతి అయినదా ?

సునందు : భగవాన్ ! పితామహుని కంఠస్వరం అపస్వరించినా మహతీతంత్రులు అపశ్రుతికి రావు.

నారద : నీవు కవివి అవుతున్నావోయ్. మా వీణా పుత్రిని స్తుతింతువుగాక! బ్రహ్మ కంఠమును అపకర్షింప నక్కర లేదుగదా! కవులు అర్థవాదములను ఆశ్రయింపరాదు. అది కథకుల పథము.

సునందు : భగవాన్ ! కథకులకంటె కవులు అధికులని భావమా ?

నారద : అనువాకముకంటె స్వస్తివాచనికం మేలయినది కాదా ?

సునందు : గురుసురపతీ ! ఈ భేదం వ్యగ్యంగా ఉన్నది.

నారద : వత్సా ! కథకులు విజ్ఞాన వాదులు; ధర్మ బోధకులు. కవులు మంగళ మిశ్రులు; మాధుర్యోపదేశకులు.

లోకానికి మంగళం కావలెను. అది విజ్ఞానంవల్ల సుస్థిమితం కాదు.

సునందు : అయ్యో! విజ్ఞానంవల్ల లోకానికి కళ్యాణం కాదా ? అయినా అది స్థిరం కాజాలదా ?

నారద : కాదు! నిజం కాదు! విజ్ఞానధార, శస్త్రధార వలె భయాభయ నిభృతమైన ప్రబల సాధన. జగత్తులో జిగీషా సంప్రదాయము సంక్షిప్తముగువఱకును విజ్ఞాన బలమును విశ్వసించుటకు వీలులేదు.

సునందు : గురుదేవా! జిగీష నిషిద్ధమయితే క్షత్రియ ధర్మ మయిన పరాక్రమ గుణమునకు పరిణతి యెట్లు ?

నారద : నందా! పరాక్రమము అపార్థరూఢమై, గాఢ దూషితమై పోయింది.

సునందు : మహాత్మా! అదెట్లు ? దాని తాత్పర్యమేమి ?

నారద : కుమారా! పరపదానికి ఇతరులని అర్థము నిపాతము. ఇతరులందఱును శత్రువులు కారు. వారిని ఆక్రమించుట ధర్మమును కాబోదు.

సునంద : అయితే! దీని నిజార్థమేదీ ?

నారద : నందా! పరమంటే నశ్వరమైన లోకసంపత్తి కంటె అన్యమయిన అలౌకిక విభూతి. దానిని చక్కగా వశము చేసికొను సాధన పరాక్రమం. అంతేకాని, ఇతరులను పరాజితులను చేసి, వారి రాజ్యములను అపహరించి, ప్రజలను బానిసలుగా ఉదాసీనించడం కాదు.

సునందు: అంటే, ప్రవృత్తిలో ఇక జయాపజయములకు తావు లేకుండా పోయింది.

నారద: లేదు! లేదు! జయమంటే లోభ మోహాది దోషములను స్వాధీనంలో ఉంచుకొనుట. ఆ సాధనలో కలిగే భంగం అపజయం.

సునందు: మహాత్మా! ఈ నిరూపణం తాత్త్వికుల ప్రకరణంలోనికి పోయింది. పురుషార్థ ప్రక్రియంగా సమన్వయించుట లేదు.

నారద: అలాగయితే, మానుషార్థవాదుల వ్యాఖ్యానమును తెలిసికో! అలూతుతో ఆలోచించు. వారు ఇల్లా పలుకుతున్నారు: పరులంటే తమతో ఏకీభవించనివారు; ఇతర పక్షము నవలంబించినవారు. వారి ఆ క్రమము అంటే వారి సమంత విధానము. కాగా, ఇతరుల కిష్టమయిన సంవిధానమును తెలిసికోవడమూ, సమరసించడమూ, పర- ఆ - క్రమము - అర్థాత్ పరులు ఉపకార పాత్రులుగాని అపకారభాజనులు కారు. ఈ పక్షములో ఇతరులను సమాధాన సాంత్వన దృష్టితో అనునయించి, అభిమతులుగా మార్చడమని తాత్పర్యం. ఔనా?

సునందు: ఆహా! ధర్మసంహిత ఎంత వ్యత్యస్తమయిందీ! అయితే పరాక్రమము, క్షాత్ర లక్షణమయిన పరాక్రమం లోకహితానికి ఉపకరించదు.

నారద: పుత్రా! ఆక్రమణంలో హింసదాగి ఉన్నది. హింసతో ద్వేష కుకూలం అంటుకొంటుంది. పగ పింజెలు

సాగుతుంది. పగలో, పొగలో చూపుకానరానట్లు హితా హిత వివేచన నశిస్తుంది. ద్వేషంలో, ఎన్నడూ, ఎక్కడా జగన్మంగళావాప్తి కాదు.

సునందు : మహామునీ ! ఈ నవ్యన్యాయం లోకసమ్మతమై, ఆచరణకు వస్తుందా ? అలా మీరు దీవిస్తున్నారా ?

నారద : ఎందుకు కాదు ? లోకమంటే ప్రజ. వారు యుద్ధ ఘాతోపహతులై, అనంతర దురంత క్షోభావిద్ధులై, నిరంతర భయోత్పీడితులుగా కాతరులై పోయినారు. వారికిపుడు శాంతి కావలె. వారి మానసిక కాయిక కఠోర దుఃఖ దుస్తాపం చల్లారిపోవాలె. జీవకోటికి ఇది అకాండ చండ గ్రీష్మం.

సునందు: ఆ తొలకరిని మీరెంత దూరాన చూస్తున్నారు?

నారద : సమీపంగానే సాళగించుచున్నది. ఇది గ్రీష్మావసానం. కాంతారోపరసారుణంగా సందె సాగింది. కుశీలవ కలాపం చక్కగా విరిసి, తత్ కంఠ కూజితం నిస్సంకుల నిర్మల కుశలంగా ధ్వనిస్తే, తొలకరి నెమిలి పురివిచ్చి నృత్యము చేస్తుంది.

(భామతి ముందునడువగా కుశీలవులు ప్రవేశింతురు)

నారద : అదిగో ! శతపత్ర శోభితమైన శారద స్రవంతి నిలాగా కుశీలవ పుత్రులతో భామతి వస్తున్నది.

(సదస్సునందున వారంతా లేచి ముకుళిత హస్తులగుదురు)

శ్రావణకా! భామతిని మా ఉపాంతమునకు తీసికొనిరమ్మో.

(శ్రావణకుడు లేచివచ్చి భామతిని మహర్షి సన్నిధికి తీసికొనిపోవును)

భామతి: భాగవత ప్రభువునకు భామతి అభివాదము.

నారద: వత్సే! ఆయుష్మతివై, పేశలరాగమాణవకులైన కుశీలవులనూ, వారి కామిత స్వామికమునూ, కలంకముక్తముగా దిద్దుదువు గాత! లోకమున కీ సమయమున రక్తానురక్తమయిన రాగానురంజనము అవసరము; అవశ్యము.

భామతి: అనుగ్రహీతనైతిని. మీ దీవనలు తీవలుసాగి పూవులు పూచుటకు సందేహ మేమున్నదీ? ముని దేవులిప్పుడు ఎచ్చటనుండి విచ్చేయుచున్నారు?

నారద: కుమారీ! శ్రీకృష్ణగవేషణలో మేము అందందు పర్యటించవలసి వచ్చినది. నందకుమార ముఖాన్వేషణలో రాధాదేవి తిరుగుతున్నది. పూర్వం చందమామకోసము చుక్కలు వెతికితే, పున్నమకోసం వెన్నెల వెతికిందట. తుదకు ఆ చందమామ, ఆ పున్నమ, ఆ వెన్నెల అందఱును ఒక్కచోటనే కలిసికొన్నారట. చుక్కలు తెల్లపోయి చీకటి చీరను కప్పుకొన్నవట. అలా ఆ కథ కైలాసానికి పోయింది. ఇంతలో మా మహతి మరులుకొన్నట్లు, మధురాలాపములతో ఇటు త్రోవ తీసింది. ఇలా వచ్చితిమి. దారిలో కుశీలవ సభాసల్లాపమంతా విన్నాము.

భామతి: (ఆశ్చర్య మభినయించి) దేవర్షీ! అదెట్లు?

నారద: ఉన్నదిగదా మా మహతి. ఆమె కామకర్ణి. ఏతత్ జీవతంత్రులకు లోకస్వర తరంగముల నాకర్షించు పాటవం కలదు. త్రిలోకములలో, ఏమూల, ఏమాత్రము కళ్యాణ శ్రుతి కదిలినా ఆమె దానిని అతి సున్నితంగా ఆకర్షించి తూ చా తప్పకుండా సంగ్రహించి వినిపిస్తుంది.

భామతి : తండ్రీ! మా కలాపంలో ఉక్తానుక్తములు, దురుక్త నిరుక్తములు దొరలి ఉంటవి. వానిని దిద్దమని ప్రార్థిస్తున్నాను. నీళ్లేవో, పాలేవో, బుద్బుదములేవో, బిందువు లేవో తెలిసికొనడం మాకు అవశ్యం.

నారద : కుమారనేత్రీ! మానవగాత్రమునకు మాన్పరాని గాయములు తగిలినవి. చైతన్యమంతా అనిష్ఠ ముష్టిఘాతలతో కాయలు కాసినది. ప్రేమ ప్రవాహింపక గడ్డలు కట్టింది. హృదయ హ్రదము ఎండి పగిలిపోతున్నది. స్నేహాభావం చేత వాక్కు చిక్కణము కాక త్రుప్పెక్కుతున్నది. ఈ కష్ట ప్రస్థానంలో క్లిష్టావస్థను గుర్తించిన నీవును, నీ గురుకులమును ధన్యులు.

భామతి : నారదప్రభూ! ఇప్పుడు చికీర్షిత మేమీ?

నారద: ఒక్కటే. ఒక్కటే ఉపాయమున్నది. నల్ల గుఱ్ఱమెక్కి కాలస్వామి క్రూరహాసముతో తొంగి చూస్తున్నాడు. చక్కగా గుర్తించు. యజనయాజనముల కిది అదనుకాదు. క్షాత్రకాలం విప్లవక్షోభతో అంతరించింది. నైతిక చక్రము సవ్యాపసవ్యములు తెలియకుండా త్రిప్పినందు వల్ల ఒడుదుడుకులలో, మిట్టపల్లాలలో కుంటెంది. గమ్యం

కానరాకుండా చాటయింది. కాబట్టి, ఇప్పుడు చిత్త ప్రసాదన సాధన ఒక్కటే శరణ్యం.

భామతి : సంయమీంద్రా! ఈ సాధనా స్వరూప క్రమములు ఉపదేశిస్తారా?

నారద : కులపాలికా! ఈ సాధనకు మంత్రతంత్రాదులు లేవు. దేశకాల పాత్రాది నియమములునూ అవసరం కాదు. ఎవరికి వారు అంతరంగములలో అనుష్ఠింపతగినది. దీనికి భావమే కీలకం. భావనయే శక్తి, మైత్రీ. కరుణాభావన అన్యుల పట్లనూ, ఉల్లాస ఉపేక్షాభావన స్వార్థమందును అభ్యాసం చేయవలెను. ఎక్కడెక్కడ సుఖస్ఫురణ తగులునో అక్కడక్కడ మైత్రీ భావన పెంచవలెను. ఎందెందు దుఃఖము గోచరించునో అందెల్ల కరుణాభావన నెఱపవలెను. పరసుఖమును తన సుఖంగా భావించుటలో అసూయకు అవకాశం దొరకదు. తన సుఖము పెరుగును. ఇతరుల కష్టములను జాలితో పంచుకొనుటలో అహంకారము క్షాళితమగును. కరుణకావరమును కడుగుతుందని లోకజ్ఞులందరు. తన సుఖము వెన్నెలవలె విహసిస్తుంటే ఇతరుల దుఃఖము చీకటివలె తొంగిచూస్తున్నదని జ్ఞాపకముండును. ప్రాణవంతమైన ప్రాణికోటిలోని చైతన్యమంతా సమానమేగదా!

భామతి : ఇక స్వపక్షములో ఆచరణీయ మెలా ఉండాలె.

నారద : జీవయాత్రలో రెండు ఘట్టములు కలవు. ఒకటి విహితమైనదీ, రెండవది అహితమైనదీ. సుందరములూ, శుద్ధములూ, శోభనములూ అయిన ప్రస్థానములను

కాంచించి, కాంక్షించి తన్మయులై తనిసే భావన నభ్యసింపవలెను. అమంగళములూ, అరిష్టములూ, అసహ్యములూ అయిన అభాగ్య ప్రకరణములను ఉపేక్షించి ఉజ్జగింజవలెను. ఈ చతుర్భావనలో తనకునూ, సహచర జనమునకునూ చిత్త ప్రసాదనం అలవడుతుంది.

భామతి : మహాత్మా! మీరు ఉపదేశించిన ఆత్మ ప్రసాదన యోగమును త్రికరణయా స్వీకరించుచున్నాను.

సుందర : జననీ! నిన్ను అనుగమించి వచ్చిన కుశీలవులును ప్రత్యయంతో స్వీకరించుచున్నారు.

నారద: శుభమ్. నేడు కార్తిక పూర్ణిమ. మీరందఱునూ ప్రసాదన వ్రతమున కుపక్రమింపుడు.

భామతి : బ్రహర్షీ ! ఇంక నీ మహావ్రతమునకు ఉపాదేయమైన సంబార మెట్టిదో ఆనతీయదగును.

నారద : పుత్రీ! నాట్య, గాంధర్వ, సాహిత్యములు దీనికి సాధనాంగములు. తీయని కళాకవాటములు తీయండి. నిత్య సుందరమైన లలితావరణంలో మంగళ జ్యోతిని లక్షించండి. ప్రాప్యమంతయు సిద్ధించును.

భామతి : భగవాన్ ! నాట్యాదులయందు అంత యోగ్యత కలదా ?

నారద: బిడ్డా! ఏ మహాధర్మసాధనకైనా శరీరమే ఆద్యము. సృష్టి అంతా స్పంద మయము. చిన్మయాణుభ్రమణమును ఆకర్షించి అందుకొనే సత్తా శరీరంలో మనస్సున

కున్నది. అందువల్ల నవ్వినా, యేడ్చినా, అనుగ్రహించినా, ఆగ్రహించినా ఆ వికారములన్నీ మనః ప్రభూతములే అని మఱచిపోవద్దు. ఆ యా వికారములను సాంత్వనములు కానీ, సాధ్వసములు కానీ సహజ ధర్మాంగ శరీరము గ్రహిస్తుంది. చేష్టా రూపంగా వెలికి తార్చి విసర్జిస్తుంది. చేష్టారూపణంలో ఆ యా వికార ప్రభావములు తత్ క్షణమే ప్రతిఫలిస్తవి. ఆ హేతువుచేతనే శక్తమయిన చేష్టాకల్పమును చక్కగా సంమర్శించి నాట్య సంహితగా నిబంధింపబడినది.

భామతి : తపస్వీ! నాట్యం సద్యః ప్రభావమైనందువలన కలిగే ఆపత్తి యేమున్నదీ ?

నారద : విద్యాధరీ ! నాడు విరాటసభలో ఆ విపత్తిని ప్రత్యక్షంగా చూచాము. కీచకదష్టయైన పాంచాలి భయానక రోష రూక్షరాక్షసివలె పరుగెత్తివచ్చింది. ఛిన్నాంబరం, ఛిద్రాలకలు, వేషమంతా రౌద్రావతారంగా ఉంది. తానుపడ్డ భంగపాటుతోపాటు, కుదిలి, కూలి పోతున్న కులాంగనా ధర్మశేఖరములు ఆమె క్రుద్ధాననంలో వాంతమైనట్లు ద్యోతమవుతుండెను. అప్పుడు, ఆమె ప్రజానాథునీ ప్రాణనాథులనూ, యావత్సబాధిష్ఠితులనూ, ప్రచండ ప్రశ్నలతో వేటాడసాగెను. వాచికంగా కాక, ఆంగికంగా కూడ ఆమె తన భావ బీభత్సమునూ, తదుద్దండ ప్రకోపమునూ, చేష్టాదికముగా సైతం అభినయింప సాగెను. ఆ మహోద్రేక దురావేశంలో, కవిసి కప్పుచున్న విపరీత రసోన్మాదంలో, ఏ సభ్యుడేని, ఏ పత్నీవ్రతుడేని, అవశంగాలేచి, విరాటునిగాని, ధర్మ

పుత్రునిగాని, ఇతర వీరులనుగాని, ఘట్టించి, ఘర్షించి, ధ్వంసించి యుండవలసింది. వాచిక, ఆంగిక సంమేళన సంరంభమును ధర్మజు డెఱుగును. అందువల్ల ఆ మహనీయుడు సతీధర్మ వ్యాజంగా పాంచాలిని వివర్తను చేసెను. తెలిసినదా - నాట్యమహత్తు! అది యెంత సాత్వికంగా సమరసింపగలదో - అంత తామసంగాకూడ తాండవింప గలదు.

భామతి : ఈ విజ్ఞానము లోకానికి మహోపకారకం. తండ్రీ! ఇంక సంగీత సాహిత్యముల మర్మ మర్యాదలుకూడా బోధిస్తే కుశీలవులు వివేకంతో వర్తింప గలుగుదురు.

నారద : అవును. వాని ప్రయోగ ప్రభావములునూ చెప్ప తగినవే. ఆ విజ్ఞానంకూడా అవశ్యం. నాట్యామ్నాయ నియతి వల్ల శరీరమునందలి రక్తధాతువులునూ, మజ్జా మాంసములునూ, తదభ్యంతర నాడీసంతతియునూ ప్రత్యణుకణ కర్షితములై, మథిత మర్ధితములై, గతకశ్మలములై తేటతేలిక పడును. ఇంతయెందుకు - నాట్యావధానంలో శారీరక భూత పంచకమే తత స్వస్వరూపాంశల నందుకొనును.

భామతి : ఆహా! ఇంతశ్రమలో ఎంత హితము నిభృతమై ఉన్నదో! క్రీడామాత్రంగా పాటిస్తున్నాము.

నారద : నిజమే. క్రీడారూపంగానే కళాశిక్ష జరుగుతుంది. అందువల్లనే కానరాని శ్రమ ఉన్నా కళలు మానవులకు అత్యంత విహితములైనవి. ఇదే నాట్య వేదాంగమయిన చాక్షుష క్రతువు. ఇంక, గాంధర్వమందో బాహిరింద్రియములకు మాఱు అంతరింద్రియ సమావర్తనం జరుగుతుంది.

అందు ప్రాణి సహజములైన శోకాశోక, గుణావగుణ, ఇష్టానిష్ట సంపర్కంచేత భిన్నభిన్నములైన సాత్విక రాజసిక తామసిక వికారములు ఉద్బుద్ధము లౌతవి. గానము స్వరాధిష్ఠితమైన కళ. ఆ స్వరము ప్రవేశింపరాని స్థలములేదు. నాట్యం లయబద్ధ మయినట్లే స్వరము శ్రుతినియతము. సరిసమానంగా వడకిన సూత్రమే సూదిలోని కెక్కుతుంది. ముళ్ళుపడ్డా, లావు సన్నములైనా సూయాణము విఘ్నమవుతుంది. అలాగే, అవిషమంగా శ్రుతి పరిష్కృతమయిన స్వరము శ్రవణ ముఖంగా అంతఃప్రవేశము చేయగలుగుతుంది. సహజంగా స్వరము, సరళమునూ. సమీచీనమునూ అయినందున దాని ప్రసార ప్రభావములుకూడా సుగమంగా, సుముఖంగా విలసిల్లి విస్తరిస్తవి. ఆపాద మస్తకమునూ కలియగొని, కదిపి, కుదిపి, కృత్స్న్యంగా గుస్తరిస్తవి. అసలు, అంతఃకరణమునే తాకి, తడిపి, ద్రవీకరిస్తుంది స్వరము. అందువల్లనే జ్ఞానేంద్రియ వికాసములేని పశుఫణిసంతానంకూడా గానమునకు కట్టుపడుతున్నది. ఈ హేతువుచేతనే ప్రసాదన యోగమందు గానము అత్యంతికమయిన స్వాదూపకరణంగా ఉపకరిస్తుంది.

భామతి : భగవాన్ ! మీ భద్ర ప్రవచనం మాకు నేడు కళ్యాణ రహస్య శిక్ష మయింది. ఇక మిగిలినది సాహిత్యం. ఏతద్దర్శన మహిమకూడా మహర్షి ముఖదీపంతో చూడదలచి సంసిద్ధులముగా నున్నాము.

నారద: జాగరిత్రీ! సాహిత్యం సంపూర్ణకళ. నాట్య గాంధర్వములు దీనిలో ఉపసర్జనీకృతములై, అదృష్టముదితము లయి ఒదిగినవి. సాహిత్యము శబ్దబంధం. శబ్దశక్తి అక్షయ

మునూ, అనంతముఖమునూ. శబ్దము లేకపోతే బ్రహ్మాండము లేదు. బ్రహ్మము జ్ఞాతవ్యము కాదు. శబ్దమే ధర్మము. తదర్థమే అర్థము. శబ్దార్థబంధమే కామము. ఇల్లా శబ్దము అఖండమునూ, అక్షరమునూ అయిన జ్యోతిస్స్వరూపి. శబ్దమందు భూర్భువ స్సువర్లోకములు మూడును ఇమిడియున్నవి. భూతభవిష్య ద్వర్తమానములు, కౌమార బాల్య యౌవనములవలె, యథారూప భాసమానములైనవి. శబ్దమునకు జరామృత్యు వికారములు లేవు. వజ్రములకంటె కఠినము. కుసుమములకంటె కోమలము. అక్షయమైన ఈ శబ్దము సువర్ణమయమై మేరువువలె పెరిగింది; రసమయమై క్షీర సముద్రమువలె విస్తరిల్లింది.

భామతి : (కుశీలవుల కభిముఖంగా తిరిగి) ఆహా! శబ్ద సవిత్రీ! అప్రమేయమైన నీ బ్రహ్మస్వరూపమునకు నమోవాకం. ఇక నీ ప్రమేయ కామరూపవాల్లభ్య మెట్లుండునో. (కుశీలవు లందఱును లేచి 'అహో శబ్ద సవిత్రీ! అప్రమేయమైన నీ బ్రహ్మస్వరూపమునకు నమోవాకం' అని పలుకుదురు)

నారద : జాగరిత్రీ! నీ వన్నట్లు శబ్దము కామరూపియే యగును. అది భాషితంగా మానవముఖావతీర్ణ మయింది. శబ్దకౌమారమైన కలభాషణము అవ్యక్త మధురమయిన గానాంశలో లీనమవుతున్నది. శబ్దబాల్యము శ్రుతియై సామగాన స్వరంగా విన్యసించింది. దాని తారుణ్యసౌభాగ్యమే రసాత్మకమయిన సాహిత్యంలో ధ్వనిగా తరంగించింది. ఇందులో నాట్యకళాభిముఖంగా రసప్రతీతిని కల్పించే కల్పన రూపకంగానూ, శబ్దార్థ వ్యంజనామూలంగా రసనిష్యందియగు రచన

కావ్యంగానూ విలక్షితములై నిలిచినవి. మృదుపద ముదిత మయినది వాక్కు. ఇష్ట వ్యంజనానురంజనమైనది అర్థం. ఈ రెంటి ఋజూపగూహనములో రాగిల్లే భావము నిత్య నవ్య మంగల్యంగా స్థాయి స్ఫురిత మయింది. తొలుదొల్త ప్రాచేత సుని కంఠములో ఈ వాగంశ ఆవిష్కరించి భాసించింది. కావ్యంలో కళాస్థానమదే. అదే రసరూపంగా అనుభూత మయ్యే బ్రహ్మానందం.

భామతి: మహర్షీ! ఆ బ్రహ్మభూయము జ్ఞానోపాసకులకు ఏకైక ప్రాప్యమని విందుము. సాంగతికులగు, కావ్యానుశీలు రకు సాధ్యమా?

నారద: బ్రహ్మపదార్థం ఒక్కటే. విద్యుదగ్ని సూర్యుల వలె రూపావచ్ఛేదము నందినది; అంతే.

భామతి: తండ్రీ! ఇది ఆర్షసూక్తము. దానితత్త్వం తేట పడేటట్లు బోధిస్తే కుశీలవులు కృతకృత్యులగుదురు.

నారద: పుత్రీ! అభేద్యములయిన తత్వగ్రంథులన్నీ కర్మ పాశాలతో, బ్రహ్మసూత్రాలతో మాత్రమే బిగిసి పెనబడ్డవి. ప్రేమప్రవాహములోని ప్రియతరంగాలకు అలాటి ఆపత్తిలేదు. కేశబంధమువలె అవి రమణీయమేళనమునే చూపించును.

భామతి: దేవా! ఈ గురువాక్యము మఱింత సంశయానుశయమై, అగ్రాహ్యంగా లాగుతున్నది.

నారద: (చిఱునవ్వుతో) అమృతము నాస్వాదించుచున్న వారికి ఆవుపాలగొడవ యెందుకు? దానికి గోవు, గోష్టం,

గోవత్సం. గోపాలకుడు-ఇంకా ఎన్నో కావాలె. అదిగాక బందం వేసి పాలు పిండాలె. అది అలా పోనీ! విను శ్రద్ధగా. సహృదయంగా విను. కర్మలు చేయడానికి వానిని చేయించే వశిష్ఠులు కావాలె. జ్ఞానం సాధించడానికి దాని సాధన ఉపదేశించే గురువులు కావాలె. కాని, ప్రేమప్రవృత్తిలో చేసే కర్మగానీ, సాధించే జ్ఞానముగానీ యేమున్నది? ఏమీ లేదు. ప్రేమించడమే. ఒక్కటే కర్మ; ఒక్కటే సాధన. అందు చేతనే ప్రేమికులకు వశిష్ఠులుగాని; గురువులుగాని ఉండరు; ఉండే అవకాశమే లేదు.

భామతి : ప్రేమయాత్రలో గురుస్థానమే లేదా?

నారద : లేదు. బిడ్డా! లేదు. తెలిసికో. గురువులకెల్లను ఆద్యగురుస్థానము మాతృదేవత. ఉపదేశము సర్వమూ ఆ వాత్సల్యపదమునుండియే ఉద్గమించును. అవునా?

భామతి : అవును.

నారద : ఆ! తల్లి! లౌకికమూ, అలౌకికమూ అయిన సమస్త జీవితవ్యాపారతంత్రమునూ చెప్పుతుంది; చేసి చూపుతుంది. చేయించి దిద్దుతుంది. కావలసినన్ని నీతులనూ, నియమాలనూ ఉపదేశిస్తుంది. కాని, ప్రేమకుసంబంధించిన క్రియాకలాపమును ఏమైనా, ఎప్పుడైనా, ఇసుమంతైనా చెప్పుతుందా? చెప్పగలదా? చెప్పే అవకాశం ఉన్నదా? లేదు గదా! అది ఆద్యంతరహస్యమయిన ప్రాణియోగము మాధురీయోగము. నిజమేమంటే, కర్మజ్ఞానయోగములకు

యోనిభూతమయిన పరమరహస్యం ప్రేమ. సృష్టిలాస్యం ప్రేమ. ఈశ్వరదాస్యం ప్రేమ. మానవులకు ఉపాస్యం ప్రేమ.

(అందఱును అంతర్నగ్నములై తలలు వంతురు. మహతి మ్రోగును. గీతావతరణ మగును)

మంగళశ్రుతి నిలుచు అమ్లానతలిని
శబ్దము రసీభవించు ప్రసన్న సీమ
తీయని కళా కవాటముల్ తీయరయ్య
అమృత లీలాకలాపము నభినయింప

(తెరలో)

చెలువము చిట్టి చిల్కలు కృపించిన కెంజిగురాకుపోల్కి మి
క్కిలి కసుగందె నీపెదవి కృష్ణుడ! యెవ్వరుపట్టి పీల్చిరో
విలవిలలాడ; ఈ రదనపీడన మెక్కడి క్రీడనంబో, క
న్నుల కనలేదు రాధ పలునొక్కలజాలిన నీ స్వరూపమున్.

అదిగో! రాధాదేవి స్వరూపావతార లక్షణము నిరూపించుచున్నది. పోదము రండు.

(అందఱును లేతురు)

(తెర వ్రాలును)

శాంతమ్, శివమ్, సుందరమ్

ఇతి పూర్ణమ్

| పుట | విరూపం | సురూపం |
| --- | --- | --- |
| 12 | ఛిన్నఛిన్నమై | ఛిన్నచ్ఛిన్నమై |
| 17 | పామరులకు | పామరులకునూ |
| 24 | మోసిన ముదితు | మోసి ముదితులైన |
| 27 | రసాలు | రసాలములు |
| | స్పందన మేదో | స్పందమేదో |
| 28 | మందకాసార | కుందకాసార |
| 29 | ఆ నిష్ట | ఆ అనిష్ట |
| 37 | ప్రణహావృత్తి | ప్రణవావృత్తి |
| 38 | తిక్తమయింది. | తిక్తమయింది. |
| | చరాచర జీవచాలన | చరాచర జీవచాలనం |
| 40 | కామానికి | కామకితవు లవుతున్నట్లున్నది |
| 41 | ఉదాసీనము | ఉదాసీనమై |
| 43 | వహుళ | వకుళ |
| | దుఃఖకార | దుఃఖకారక |
| 44 | అనంతార్థ | ఆనంత్యార్థ |
| | జీవితం విపాకము | జీవితవిపాకము |
| 45 | అందిస్తుంది | అందిస్తుందీ ? |
| 46 | సమాలోకనం | సమాలోచనం |
| | పిత్రగోత్ర | పితృగోత్ర |
| 48 | పర్యుషీతం | పర్యుషితం |
| 49 | ప్రశవ | ప్రసవశాల |
| 52 | హృదయంకోశం | హృదయకోశం |
| 53 | సస్తోత్తరీయ | స్రస్తోత్తరీయ |

| పుట | విరూపం | సురూపం |
|---|---|---|
| 54 | కట్టూట | కట్టూఅట |
| | కుండకు | కుండలు |
| | ఆదిగో | అదిగో |
| | నడికట్టిన | నడికట్టైన |
| 57 | అచ్చినట్లు | అబ్బినట్లు |
| | వద్ధని | వద్దని |
| 58 | పరిపుల్లలయ్యే | పరిపుల్లములయ్యే |
| 59 | సంనివాత | సంనిహిత |
| 60 | (అగ్ని) | (ఆగి) |
| 61 | యిల్లా | ఎల్లా |
| | అరిసలె | అరిసిలే |
| 64 | ఇంపితవు | ఇంసిత మవుతుందో |
| | కొనెలు | కొనలు |
| 66 | అతివా ! | అత్తికా ! |
| | కరగపోతే | కరగకపోతే |
| 67 | ఘరణా | ఘర్షణా |
| | భీభత్స | భీబత్స |
| 68 | పోషకములు. పయిరగాలి పచ్చపొలానికిలాగా, | పోషకములు, పయిరగాలి పచ్చపొలానికిలాగా. |
| 71 | మర్ధల | మర్దల |
| | సముదింతం | సముదితంగా |
| 74 | అకామంగా | అకామకామ్యంగా |
| | పడుచుతనపు | పడుచుతనము |
| 75 | చుంబన | చుంబనం చేసాడు |
| 79 | ఇంచుమించుక | ఇంచుకించుక |
| 82 | నిషుర | నిష్ఠుర |

| పుట | విరూపం | సురూపం |
|---|---|---|
| 83 | లోకాపవాదం | లోకాపవాద పీడ |
| 86 | విష | విభా |
| | దుర్దశమ | దర్దశమలి |
| 88 | చక్క | చక్కి |
| 91 | కిసోరమా | కిశోరమా |
| 93 | కాంతవరణ | కాంతావరణమంత |
| 94 | అంటి | అంటీ అంటక |
| 103 | మిత్తగా | మైత్తగా |
| 106 | ధ్యనిస్తు | ధ్వనిస్తు |
| 110 | మీమాంస | ఈ మీమాంస |
| 112 | ఊహ | ఊహ కేవలం |
| 114 | వికస్వనులై | వికస్వరులైన |
| | బుద్ధింద్రియ | బుద్ధీంద్రియ |
| | సామాజికి | సామాజిక |
| 115 | ఉత్తాలి | ఉత్తాలసాలం |
| 117 | విపాకినికి | విపాకానికి |
| 126 | అభాసం | అభ్యాసం |
| | పఅసుఖ | పరసుఖ |
| 128 | ధర్మాంగ | ధర్మంగా |
| | చేష్టాకల్పమును | చేష్టాకల్పము |
| 129 | మర్ధితములై | మర్దితములై |
| | తతస్వస్వ | తమస్వస్వ |
| 130 | శిక్షమయింది | శిక్షకమయింది |
| 131 | బ్రహ్మము | బ్రహ్మమునూ |
| | జ్ఞాతన్యము | జ్ఞాతవ్యము |
| 133 | చిల్కలుకృషించిన | చిల్కలు కషించిన |

